మహీధర రామమోహన్ రావు,
సంపాదకుడు,
విశ్వసాహిత్యమాలా,
ముంగండ,
(Via.) అంబాజీపేట, తూ.గో. జిల్లా.

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల,
జగన్నాధపురం, కాకినాడ.

వెల ౨ అణాలు.

279

# మా సందేశం.

ఈ పుస్తకంలో తరుచుగా "విప్లవం" అనే శబ్దం అడుగడుగుకీ కంట బడుతూంటుంది. మనవాళ్లు "విప్లవ" శబ్దం చూసేటప్పటికి ఏ పెద్ద పులినో చూసినట్లు, గుడ్లు వెళ్లబెట్టి, గుండెలు బిగ బట్టుకొని 'అమ్మబాబో' యని ఆమడ దూరం పరుగెత్తడం రివాజు. కాని నిజానికి "విప్లవ" శబ్దం మనుష్యుని బుద్ధినే భ్రమింప చేయదగినంత భయంకరం కాదు. "విప్లవం" అంటే మార్పు. మనుష్యునికి తెలిసినా, తెలియక పోయినా ; గుర్తించినా, గుర్తించక పోయినా, అతని వ్యక్తిగత జీవితంలో, సాంఘిక జీవితం లో - రాజకీయ జీవితంలో అనుక్షణం మార్పు కలుగుతూనే యుంటుంది. ఆ మార్పు అన్న శబ్దానికే సంస్కృత పర్యాయ పదం "విప్లవం."

"విప్లవం" ఉలకవలసిన పదం, కులకవలసిన పదం కూడా కాదు. సాంఘీకంగా కానీండి - రాజకీయంగా కానీండి ఏ విధమయిన విప్లవమూ మేము కోరము అనడం అంత తెలివి తక్కువ దనంలేదు. విప్లవం ఒకరు కోరితే వచ్చేదీ - పొమ్మంటే పోయీదీ కాదు. మనుష్యజాతి ఉన్నంత వరకూ, ఈ భూగోళంలో ఒక పరమాణువు మరొక అణువుతో కలిసి యున్నంత వరకూ అను క్షణం విప్లవం తప్పదు. పరిసరాలనున్న ప్రకృతి లోంచి ఆనందాన్ని, సౌఖ్యాన్ని, ఆకర్షించ డానికి జీవజాలం చేసే ప్రయత్నమే విప్లవం. ఆ ప్రయత్నం అణిగి పోతే అంటే జీవజాలం నశిస్తే ఈ విప్లవాలు మనకు తెలిసినంత వరకు అంతరించి పోతాయి.

మనుష్యుడు ఆయా కాలంకి అనుగుణంగా సంఘాన్ని - రాజ్యాన్ని. నిర్మించు కున్నాడు. అందులోంచి తనకు బాధ కరంగా కనిపించిన వస్తువు నల్లా తొలిగించి సంస్కారం చేస్తూంటాడు ఎప్పటి కప్పుడు,

గ్రామపంచాయతీలు - మొదలు - సామ్రాజ్యాలవరకు ఈవిధంగానే నిర్మించ బడినాయి. రాజరికం - పార్లమెంటరీ విధానం. ఈ విధంగానే నిర్మూలించ బడుతున్నాయి. ఈ సమీకరణాలు - సంహరణా, మనుష్యుడు తాను సుఖం పొందే ప్రయత్నంలో నిష్కపటంగా ఆచరించినవే.

అల్లాంటి నిష్కపట భావం తోటే నేటి "స్వామ్యవాద సిద్ధాంతాలు" కూడా నిర్మించ బడినాయి. ప్రతివిషయం కొందరికి కష్టం కలగ చేయవచ్చు. ఏదో కొందరికి కష్టంగా ఉంటుందని, మనుష్యుడు సుఖపడే టందుకు సూచించ బడిన సలహాలని బహిష్కరించడం - బెదరడం, తెలివిగల వాళ్లు చేయవలసిన పనిగాదు.

వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగ పడక - వివరింప దగున్.

ముంగండ.
3 - ఆగష్టు 1936

అనువాదకుడు.

గ్రంథాలయం.

# సందేశము.



సోదరులారా! నేను చెప్పబోవునది యువకులకే. ఈవ్యాసముయొక్క సంపూర్ణమగు అర్థమును యువకులే గ్రహింప గలుగుదురు. శరీరమందేగాక మానసికంగాకూడా వృద్ధాప్యమును పొందిన వారు శ్రమపడక, యీ కరపత్రమును క్రింద నుంచివేయుడు.

మీరు, జీవితమందలి ముఖ్యమగు సంధికాలము నందుండి యున్నారు. ఒకరు ప్రకృతిశాస్త్రములు, ఒకరు తత్త్వశాస్త్రములు, మరి యొకరు వైద్యము, మరొకరు వేదాంతశాస్త్రము, యిదీ అదీ యేమిటి, అందరూ తలొక విజ్ఞానశాఖయందును ఉత్తీర్ణులై, మానవ సంఘము యొక్క క్షేమాభివృద్ధులకై పాటుబడి, మీ శక్తియుక్తుల నన్నిటిని లోక కల్యాణమునకై ధారపోయవలెనని కూడ, తలంచుచుండి యుందురు. కేవలమూ ధనార్జనా, కుక్షింభరత్వమూ, మానవ జీవితానికి ఆదర్శాలనీ, సంకుచితమగు వ్యక్తిసుఖమే పరమార్థమనీ, తలచు, పశుప్రాయులకు, నేను చెప్పునదేమీ ఉండదు. జీవిత రంగములో ప్రవేశించ బోవుచున్న, యీ యౌవనావస్థలో, మీ ఆశయము లున్నతములు. మీ జీవిత మాశాపూరితము; మీకు, యుక్తాయుక్త వివేకజ్ఞానముతో పని చేయుగల వయస్సు సమీపించినది. మీరు త్వరలోనే జీవితరంగమున ప్రవేశింప బోవుచున్నారు. అనేక క్లిష్టసమస్యలు మిమ్మెదుర్కొన గలవు. వాటిని, మీరెట్లు విడదీయ గలుగుదురో, చూడవలసి యున్నది.

మానవసంఘాన్ని, ప్రస్తుతం. యెదుర్కొంటూన్న సమస్యలను, ముఖ్యంగా ఆర్థిక, సాంఘిక, రాజకీయములను పరిష్కరించి, మానవ

సంఘాన్ని ఒకే ఒక, విశ్వమానవ సంఘంగా, నిజమగు స్వాతంత్ర్యము, సమానత్వము, వీటిపై నాధారపడియున్న దానినిగా చేయుటకుఁ తగు ధైర్యమును, మీరు వహించవలెను.

ప్రస్తుతము, మీకు ఒసంగబడుచున్నది, విద్యగాదు. కాపిటలిస్టు ప్రభుత్వముల ప్రచారమే యని చెప్పవలెను. ఈ విద్య, మానవునియందు సంకుచితత్వమును, మోసము, దోపిడి మొదలగు దుర్గుణములనే ప్రేరే పించునదిగా యున్నది. మన బాహ్యప్రవర్తనకును, హృదయ ప్రబోధము లకును, సామరస్యమును కుదుర్ప, వీలులేకున్నది. విశాలభావములుండి, మానవసేవ చేయుదమనుకొన్నవారికి, తావులేకున్నదీ సంఘమందు. ఇన్ని మాటలెందుకు? ప్రస్తుతమునకు వత్తము.

ఓ యువకుడా! నీవు చదువుచున్నది, వైద్యశాస్త్రమా! బాగుంది. వైద్యవృత్తివల్ల ననేకమందికి సేవ యొనర్పవచ్చును. బీదల కుచిత వైద్య సహాయము చేయవచ్చును. కేవల ధనాకర్షణమాత్రమేగాక మానవసేవ జేయుటకూడ నీ కార్యక్రమ మందున్నది. భేష్! యువకుడా, నీ హృదయ మందు దయకు స్థానమున్నది. నీవు నిజమగు యువకుడవు. కాని, నీ యాశయములు, యథార్థ జీవిత మందెంతవరకు నెరవేరునో చూడవలెను.

నీ చదువు పూర్తియైనది. డాక్టరు పరీక్షయందు త్తీర్ణుడ వైతివి. ప్రాక్టీసు ప్రారంభించినావు. ఈసంఘము నెట్టి పెడాకరములగు భ్రమ లావరించి యున్నవో, నీయనుభవము వల్ల తెలిసికొందువు.

ఒకరోజున కడుబీదయగు వాడొకడు, నీవద్దకు వచ్చెను. తనభార్య చాలబాధ పడుచున్నదనియు, ఒకసారి చూచి పోవలయుననియు, నిన్ను పిలచెను. నీయందు, దయయనునదింకను, యింకి పోకుండుటచే వానికోరిక నంగీకరించి, వానిని వెంబడించితివి. పట్టణముచివరకు పోయి పోయి, పేదజనులుండు సందు గొందుల బడి, పోవుచుంటివి. వీధులు యిరుకుగాను, మురికితోను, దుర్గంధపూరితములు గానూ ఉండి, మనుష్య

కెట్లిక్కడ నివసించుదురా, యని యాశ్చర్యపడితివి. కడకు, నీవొక గుడిసెలో ప్రవేశించి, మధ్యవయస్కయగు నొకస్త్రీని చూచితివి. ఆమె చాల కృశించి యుండెను. ఒంటిమీద చాకీచాలని చినుగు పీలికలుగాక మరేమియును లేవు. ఇంటిలో వెలుతురులేదు. నేలంతా చెమ్మగా ఉండి, దుమ్ము కొట్లాడుతూ ఉంది. ఒక ప్రక్క శల్యమాత్రావశిష్టులగు ముగ్గురు పిల్లలు, మురికి యొడళ్లతో, అటునిటు బడి నిద్రపోవుచుండిరి. ఆకలికి యేడ్చి, యేడ్చి, నిద్రించి యుండబోలును. నిస్సత్తువగొనిపోయిన యాతడే గృహయజమాని. ఆతడొక మిల్లులో కూలిగానుండి పనిచేయుచుండేవాడు. కాని, ఆరుమాసములక్రిందట, అవసరము లేక కాబోలు, యజమానులాతనిని, పనినుండి తొలగించిరి. అప్పటి నుండియు, యెన్నిపాట్లు బడినను, ఆతనికి కూలిపనియే దొరుకలేదు. భార్య నాలుగు మాసముల వరకును, గృహస్థులయిండ్లలో చాకిరీచేసి సంపాదించుచు వచ్చిన బేడడబ్బులే, ఆ దరిద్ర కుటుంబమున కాధారమయ్యెను. ప్రొద్దుగూకులూ, రెక్కలు ముక్కలగునట్లు పనిచేయుటవల్లనూ, సరియగు ఆహారములేకపోవుట వల్లనూ, ఆమె యనారోగ్య పీడితురాలైయుండియు, విధిలేక కూలికి బోవుచుండెను.

క్రమముగా రోగమెక్కువై యామె మంచము బట్టెను. కాదు, కాదు, మంచమెక్కడ, యిట్టి దౌర్భాగ్యులకు. చాప బట్టెననిన, యిట్టివారి విషయములో సమంజసము. ఇక్కడకు నాలుగు రోజులనుండిగాబోలు, ఆ కుటుంబమంతయు పస్తు. తినుటకు తిండిలేదు. చేయుటకు పని దొరకదు. అట్టి స్థితిలో మందు లెక్కడనుండి వస్తాయి. పోనీ, యిరుగు పొరుగు వారేమైన సహాయమొనర్తురా యన్నను, వారింతకన్నను హీనస్థితిలో నున్నట్లున్నది. ఎక్కడ జూచినను వెలవెలబోవు ముఖాలతో, ఎముకల పోగులగు చిన్నపిల్లలు; దుర్వాసన, చీకటి, చెమ్మ, ఆకలి, నిరుద్యోగము, దారిద్ర్యము; అయ్యో, యెట్టి దురవస్థ.

నీ ముఖమందు యే కొంచెమైనను సౌజన్యత కాన్పించినచో, పాప మా యమాయికులు, నీతో తమ కష్టసుఖములను, వెళ్లబోసుకుంటారు. వాళ్లకేమి సలహా చెప్పాలనుకుంటావు, నీవప్పుడు? పరిశుభ్రంగా గాలీ, వెలుతురూ, ఉన్న చోట్లలో ఉండాలనీ, పుష్టికరమైన ఆహారం తీసికోవాలనీ, విశ్రాంతి తీసికోవాలనీ, యింకా యిట్లాంటివే కొన్నిటిని, వాళ్లకు చెపుతావు. అంతే గాదూ? కాని, యిల్లా చెప్పడం, వాళ్ళ నవమాన పరచడం గాదూ? అల్లా చేసికోడానికి, యేమాత్రం అవకాశము ఉన్నా, వాళ్లు నీ సలహాకోసం యిన్నాళ్లు యెందుకు కనిపెట్టుకొని కూరుచుంటారు?

ఇంటికి వెళ్లినతర్వాత కొన్ని దినములవరకూ, యీదృశ్యమే, నీకళ్లముందర ప్రత్యక్షమవుతూ, నీకు బాధగలిగిస్తూంటుంది. ఈ జనం అంతా యిల్లాగ బాధపడుతూ ఉండడానికి కారణం, యే దేవుడుమీదో, యే కర్మమీదో పారేసి, రెండు తిట్టుకుని ఊరుకుంటావు.

నీవు యిల్లాంటి దృశ్యాలకి అలవాటుపడి, అంతరాత్మను చంపుకొని, ఊరుకోవాలి అనుకుంటావు. గాని, నీలోని విమర్శనాశక్తి, నీకు తెలియకుండగనే విజృంభించి, నీకు వీటిని జ్ఞాపకం చేస్తూఉంటుంది.

రోజులు గడిచిపోతూంటాయి. మరొకరోజున ఒక ధనవంతుని యింటిలో,నొక రోగిని చూడ్డానికి ఆహ్వానించబడి, మోరుటాపై బోయి, చూస్తావు. రోగి, ఒక స్త్రీ. మిక్కిలిబలిసి, కదులుటకు కూడా శక్తి లేక, ఆయాస పడుతూంటుంది. జీవితమంతలోనూ, పనిఅంటే యేమిటో యెరక్క, విందులూ, వినోదాలు, భోగాలు, పశువులాంటి భర్తతో కాపురం, అంతే ఆమె జీవితములో నిత్యచర్య. ఆమెకు నీవు చెప్పినదేమిటి? తేలికైన ఆహారము తీసుకుంటూండాలనీ, యింద్రియలోలత తగ్గించుకోవాలనీ, కొంచెం శరీర పరిశ్రమ చేస్తూండాలనీ; ఇత్యాది నియమాలే కామా?

ఇవే కాదు, నీవు చెప్పేది? బాగావుంది! ఇప్పుడు నీకు సంఘంలోని పరిస్థితులు కొంతవరకు అర్థం అయివుంటాయి. మానవసంఘంలో యెట్టి మూఢపుకట్టుబాట్లు పాతుకుపోయి పీడిస్తూన్నాయో, వాటిని తొలగించవలసిన అవసరం యెంత తీవ్రంగా ఉందో, నీకు తట్టుతుంది.

ఒకతె, తన జీవితకాల మంతటిలోనూ విశ్రాంతి, సుఖము, యెరుగక, కడుపునిండ తిండికూడ దొరకక, నిరంతరబాధలచే చనిపోతూంది. మరొకతె, జీవితకాల మంతటిలోనూ పనియేమో యెరుగక, సోమరియై, పీడిత యగుచున్నది.

మనలో చాలమంది, యెట్టి దారుణవిషయములనైనను చూచియు చూడనట్లుగా, కాలము గడపుకొని పోవుచుందురు. నీవును, అట్టి నీతిదూరులైన దౌర్భాగ్యులలోనే చేరుదువా? శరీరములోని రక్తమును కుదుకత్తించు యే భీభత్సదృశ్యమునైనను, పైశాచిక కార్యములనైనను, చూచి నిట్టూర్చుదురు కొందరు; యిట్లాంటివెన్నో చూచితి మని సరిపుచ్చుకొందురు. తాగియో, వారి వినోదములలో, యీ విప్లవకరదృశ్యములను ముంచివైచియో, కొందరు కాలము పుచ్చుదురు. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి, సంఘములోని యీ విరుద్ధదృశ్యములకు, మన మానసము అలవడిపోవును. నీలోని పశుత్వము జయముగాంచును; స్వార్థము విజృంభించును; విలాసములతో కాలము గడపు వారితోనే తిరుగుటకు యత్నించుచు, అట్టి జీవితము గడపుటకు వలయు సాధనసామగ్రిని సమకూర్చుటకే కాలమంతయు వినియోగించుదువు. కాని యిట్టి దౌర్భాగ్యులను చూచుటకే గాదు, సరిగదా అట్టివారున్నారని తలంచుటకుకూడ ప్రయత్నింపవు. కాని, ఓ సోదరా! నీయందే మానవత్వమున్నచో, నీయుద్దేశముల కన్నింటికిని క్రియారూప మొసంగగల్గు ధైర్యశాలివే యగుచో, నీయందు పశుత్వముచే మానవత్వము పూర్తిగా యణగ ద్రొక్కబడక మిగిలియున్నచో, నీవు మరియొక లాగున ప్రవర్తింతువు. ఒక రోజున, నీవు “అబ్బే, యిది

చాల అన్యాయము; ఘోరాతి ఘోరము; ఈ పద్ధతిని కొనసాగనీయ కూడదు. రోగములను కుదుర్చుట చేతనే ప్రారంభిక సేవ కాజాలదు. ఇది చాలదు. వైద్యవృత్తిని కుక్కలు ముట్టుకుపోనీ; మానవ సేవకు ప్రారంభించుట యిట్లుగాదు. మరింకెట్లు? ఆ! తెలిసినది!! ఇట్లైనచో!!! మంచి గాలి, వెలుతురు, గల యిండ్లు, పరిశుభ్రమగు నాహారము, తక్కువ శ్రమ నిచ్చు పని; మానవావసరము లివియేగదా. ఇవి యందరకు కలుగునట్లుగా, సంఘమేర్పరచ వలెను. ఇట్లుగానిచో వైద్యుని వృత్తియంతయు, మాయ, గారడీ, మోసము; కానీ"...యని తలంచుచు, యింటికి బోదువు.

ఆ రోజుననే, నీవు సోషలిజమనిన తెలిసికొన గలవు. అప్పుడే యా విధానమునుగూర్చి పూర్తిగా తెలుసుకొన గోరెదవు. పరోపకారము, మానవ సేవ, యనునవి, నీయభిప్రాయములో వ్యర్థప్రలాపములు, పుస్తకములలో నుండదగినవియు మాత్రమే గానిచో, ప్రకృతిశాస్త్రజ్ఞుల సిద్ధాంతములను సాంఘిక కట్టుబాట్లకు జతపరచి, పరిశీలనా దృష్టితో చదువుచో, నాడే నీవు, మాలో నొకడవై పోదువు. మాకువలెనే తీవ్రముగా పనిచేయుచు, కుళ్లిపోయిన యీసంఘము యొక్క కట్టుబాట్లనన్నిటిని, నిర్మూలించుటకై సాంఘికవిప్లవమును లేవదీయుటకై యత్నింతువు.

అదేమిటి. నీకు మళ్లీ, మరొక సందేహము తోచిందా? 'ఏమో, యిట్లాంటి కార్యములు చాల చేయవచ్చు గాని, .........నా మటుకు నేను, ఖగోళ శాస్త్రములోనో, వేదాంత శాస్త్రములోనో, రసాయన శాస్త్రములోనో కృషిచేస్తాను. దానివల్ల, ప్రస్తుతం గాకపోయినా, ముందు సంతతివాళ్లకైనా, చాల ఘనతర శాస్త్రీయ విషయములను తెలుప గలుగుతాను. ఇంతకంటె సంఘసేవ యేమున్నది.' అనేనా?

ఓస్సి, ఇదా నీవూహ. మొట్టమొదట్లో శాస్త్ర పఠనవల్ల, నీవు కోరే దేమిటో చూద్దాం. ఆ విజ్ఞానోపార్జనవల్ల కలిగే ఆనందము, సంతృప్తి, అంతేనా? సందేహం లేదు, ప్రకృతి రహస్యములను పరిశీలించుటలో,

వాటిని ఛేదించడంలో, నీ బుద్ధిచాతుర్యము నుపయోగించడంవల్ల, నీకత్యధి కానందము గల్గుననుమాట నిజమేకావచ్చును. అంతేయగుచో, తన ఆత్మా నందమునకై శాస్త్రీయ చర్చలలో మునిగి తేలుచున్న వేదాంతికిని, కల్లుచేత గలుగు తాత్కాలికానందము, సంతృప్తి చేతనూ, మైమరచి చెట్టు క్రింద బడియున్న యా త్రాగుబోతుకును, భేదమెందులో నున్నది? ఎటు వచ్చీ వేదాంతికి యే రవ్వా, రట్టూలేదు; త్రాగుబోతుకన్న మరికొంచెం తెలివైనవాడు. ఎందుకంటే, అతని కంటె యెక్కువ ఆనందమును, మరి చాల కాలమువరకూ ఉండేదాన్ని, యేరుకొన్నాడు. అంతేగామరి; ఇద్ద రికీ కూడా తాత్కాలిక సంతృప్తి, స్వసుఖము, ఆత్మానందమూ, ప్రపం చములో యితరు లింకా ఉన్నారనే విషయం మరువగల్గడమూ, యివే గాదా కావలసినవి.—

కాని, ఓ యువకుడా, నీకిట్టి నీచమగు స్వార్థజీవితమునే గడుపుట కిష్టము లేదు, గాదా? నీవు శాస్త్ర చర్చలలో కాలము గడపుటకు కోరు చున్నది,- తోటి మానవుల సేవకే గాదా? మానవాభ్యుదయమునకే గాదా? ఇట్టి విశాలాభి ప్రాయములతోనే గాదా, నీవు శాస్త్ర పఠనము నందు, శాస్త్రీయ చర్చలందు మునిగి తేలుతూన్నది!

ఎంత దూరదృష్టి! ఎంత విశాలాభిప్రాయములు! కాని, ఒక్కటే సందేహము. మొదట్లో ప్రారంభించు నపుడు, మనవాళ్లలో, యిల్లా అను కోని వాడొక్కడేనా ఉన్నాడా? తర్వాత యథార్థ జీవితంలో వాళ్ల ఊహ లెంతవరకు సఫలము లౌతూన్నాయి? అనియే.

ఇంకోసంగతి తటాలున స్ఫురిస్తూంది. నీకు మానవ సంఘము యొక్క మంచియే కావలసి వచ్చుచో, తోటిమానవులకు సేవజేయుటకే, నీకు ఉద్దేశ్యమున్నట్లయితే, వెంటనే యీప్రశ్న వచ్చి తీరుతుంది. నీలో విమర్శనా జ్ఞానము యెంత తక్కువగా యుండనీ, యీ విషయము నీకు స్ఫురింపకపోదు. ప్రస్తుత మానవ సంఘములో, ప్రకృతి శాస్త్రములు

(భోగానుభవమునకే పనికి వస్తూన్నాయి. కొద్దిమందికి, జీవితము నధికసుఖకరము గానూ, చాలామందికి, బాధాకరముగానూ, భారముగానూ జేస్తూన్నాయి. మొత్తంమీద శాస్త్రీయజ్ఞానము, మానవులలో చాలమందికి, అందని మ్రాని పండే, యైనది.

ఈ విశాల విశ్వమును గురించీ, దాని పరిణామాభివృద్ధులను గురించీ, శాస్త్రజ్ఞులు తమ దృక్పథాభిప్రాయాలని వ్యక్తీకరించి, నూరు సంవత్సరములు దాటినదే! కాని యీవిషయములు తెలిసిన వారెందరున్నారు? నిజమగు విమర్శనా దృష్టితో, నీవిషయము నుపలక్షించిన వారెందరు? కొద్దివేలమంది మాత్రమే. కొన్ని వేల లక్షలలో, కొన్ని వేలమంది! మిగిలిన వారందరూ మూఢాచారములలో, అసూయా ద్వేషములలో మునిగి, అటు పశులకన్న హీనస్థితిలో నున్నారే! మతం పేరుచెప్పి, ప్రపంచాన్ని మోసగించేవాళ్ల మాటలకు లోబడి, వీళ్లంతా యే రాక్షస కృత్యాన్నైనా చేయడానికి సిద్ధమే!

ఇంకొక్క అడుగు ముందుకు పదండి. ప్రజాసంఘంయొక్క శారీరక, మానసికాభివృద్ధికి, ప్రకృతిశాస్త్రం, యేమి ఉపకరించింది? శాస్త్రములు చెప్పుతూనే ఉన్నాయి, మనశరీరాలని ఆరోగ్యంగా యెట్లావుంచుకోవాలో, సంఘమును మంచిస్థితిలో యెట్లా నడుపవలెనో, వగైరాలను గూర్చి. కాని, అనుభవం వల్ల తెలియడంలేదూ, యీమాటలు పుస్తకాలలో మాత్రమే వున్నాయనీ, ప్రజలకి వుపయోగంలోకి రావడంలేదనీ! మనకి, యీసంగతి తెలియకపోలేదు. కాని, యిల్లా యెందువల్ల జరుగుతూవుంది? ... యెందువల్లనా? ... శాస్త్రజ్ఞానము, మానవులలో, కొన్ని సౌకర్యములు గలిగియున్న వాళ్లకే అందుబాటులో వుంది గనుక; సాంఘిక భేదము, మానవుల్ని రెండుతరగతుల క్రింద, కూలికి పనిచేసే బానిసలూ, దోచుకొనే పెట్టుబడిదారులూ, అనే రెండు విభాగాలక్రింద చీల్చివైచి, తొమ్మిదివంతుల జనానికి, విజ్ఞానాన్నేగాక, జీవితావసరములను గూడ అందుబాటులో లేకుండ జేసింది గనుక.

కావలిస్తే యెన్ని ప్రమాణాలైనా చూపెంచ వచ్చు. కాని, ఒక్కటి చాలదూ! చూడండి! అదుగో! పెద్ద పుస్తకభాండాగారము! ఎన్ని బీరువాలు! ఎన్ని పుస్తకాలు! కాని లోపలికి పోవటానికి యెందరికో వీలులేదు. అందరిజోలి మనకెందుకు! కొద్దిమందికి మాత్రమే, వీలున్నది. పోనీ, ఆవెళ్ళినవాళ్ళైనా, యేం సుఖంగా వున్నారు. కిటికీల అద్దాలన్నీ దుమ్ము కొట్టుకుపోతూండడంవల్ల, సూర్యకాంతికి చోటు వీలులేదు. ఒక్కొక్క అడుగు వేస్తూన్నకొద్దీ, యీ అనుభవం బలపడుతూంది. ప్రపంచంలో ప్రస్తుత సాంఘిక వ్యవస్థ, యీ స్థితిలోనే వుంది. ఒక్కసారి ఆలోచించి చూడండి!

ప్రస్తుతం, మనం కొత్తగా శాస్త్రీయ విషయాలని చర్చించి, కొత్త పరిశోధనలను చేస్తూండడమే మన కర్తవ్యంకాదు. చేయవలసిందల్లా, కనిపెట్టబడిన సత్యముల నన్నిటినీ బాగా ప్రచారం చేయడం, మానవుని నిత్యజీవితంతో వాటిని మేళవించడం, వాటియందు మానవులందరికీ సమాన హక్కులు, సమాన అనుభవం ఉండేటట్లుగా చేయడం, మానవ సంఘమంతా, యీ పరిశోధనా ఫలితముల నాచరణలో పెట్టగలుగునట్లు, వాటి ఫలితముల ననుభవించునట్లు మాత్రమే, మనము యీ సంఘ విధానాన్ని, పరిస్థితులను, యేర్పరచాలి. అప్పుడే, శాస్త్రములు, యే కొద్దిమందికో భోగవస్తువులుగా, స్వార్థములుగా ఉండడం మానేసి, మానవుని నిత్యజీవితము సౌకర్యయుతముగానూ, సౌఖ్యవంతముగానూ జేయుగలవు. పరమోత్కృష్టమగు న్యాయము, దీనినే కోరుతూంది.

ఇంతేగాదు. కనిపెట్టబడిన నూతనపరిశోధనా ఫలితములను స్వీకరించి, ఆచరణలో పెట్టగలుగు స్థితిలో సంఘమున్నపుడే, శాస్త్రములు నిజముగా అభివృద్ధిబొందగలవు. యంత్రమూలకముగా ఉష్ణోత్పత్తి చేయ వచ్చుననే సిద్ధాంతము (The Theory of the machanical Origin of Heat) విషయం చూడండి. ఈ కొజున హారన్, క్లాషి

యస్‌లు సూత్రీకరించినట్లే, ఒకశతాబ్దమునకు పూర్వమే యీ సిద్ధాంతములు కనిపెట్టబడినాయి. కాని, యెనుబది సంవత్సరముల వరకూ, యివి యన్నియు విశ్వవిద్యాలయ రికార్డులలోనే యస్తమించి పోయినవి. కడపటికి శాస్త్రజ్ఞానము అభివృద్ధిచెంది, సంఘము వాటిని గ్రహింపగల్గు స్థితిలోనికి వచ్చినతర్వాతనే, యెనుబది సంవత్సరముల పిమ్మట, వాటిని బూజుదులిపి, పైకిదీశారు. ఎరాస్మస్ డార్విన్ మహాశయుని పరిణామవాదము, మూడు తరములవరకు మూలబడి యుండి, యుండి, తర్వాత నాతని మనుమని యొద్దనుండి, విశ్వవిద్యాలయ పండితులచే స్వీకరించబడియెను. అదైనా యెప్పుడనుకొన్నారు? ప్రజలనుండి బాగుగా యొత్తిడి గలిగిన తర్వాతనే! కవి, చిత్రకారుడు, మొదలగు వారికివలెనే, వేదాంతి, శాస్త్రవేత్తలు కూడ, తమకాలమునందలి సంఘమునుండి జనించిన వారే; గాన, ఉత్తమ పరిణామమును కోరువారు, ముందుగా సంఘమును సంస్కరింప వలెనని, యిప్పుడైన ఒప్పుకొనరా?

కాని, నీ వీ యూహాలతో నిండియుండుచో, ప్రస్తుతపరిస్థితులలో, సంపూర్ణమగు విప్లవము దెచ్చుట అనివార్యమని తోచకమానదు. ప్రస్తుత పరిస్థితులలో శాస్త్రజ్ఞులు, శాస్త్రీయ విషయములతో తలలు బద్దలుచేసికొనవలసి వచ్చుచున్నది. మిగిలిన జనసామాన్యమన్ననో, పది, యిరువది శతాబ్దములకిందటి యజ్ఞానస్థితిలోనే, గాఢాంధకారములోనే ఉండి పోతూన్నారు. వెల్లడిచేయబడిన శాస్త్రీయ సత్యములనే నమ్మజాలని మూఢులై, కేవలమూ బానిసలుగానూ, వస్తునిర్మాణ మొనరించు యంత్రములు గానూ మాత్రమే యున్నారు. నీవేదినమున విశాలమై, అగాధమగు శాస్త్రీయసత్యములను, సంపూర్ణముగా తెలిసికొన గలుగుతావో, ఆరోజుననే యింకనూ శాస్త్రపరిశోధనలతో కాలము గడుపవలయునను కోరిక తగ్గిపోతుంది. కేవలమూ, గ్రహింపబడిన శాస్త్రవిషయాల్ని, పూర్తిగా మానవసంఘమంతా, అనుభవింపగలుగునట్లు చేయుటకై, సాంఘిక విప్ల

వమును తీసికొని వచ్చుటకై ప్రయత్నించుతావు. నీవెట్టి నిష్పక్షపాత బుద్ధితో శాస్త్ర పరిశోధనయందు మెలంగితివో, అట్టి విశాలభావములతోనూ, నిష్పక్షపాత బుద్ధితోనూ, యీ సాంఘిక వాదాన్ని గురించి తెలిసికోవాలి. వ్యర్థసందేహాలని వదలిపెట్టి, మానవసంఘ క్షేమాభివృద్ధులకై పనిచేయుచున్న వారిలో చేరుతావు. సంఘములో, గూడ కొద్దిమంది, యిదివరకే సమస్తభోగములనూ అనుభవిస్తూన్నారో, సమస్త ఉత్పత్తిపరికరములనూ తమ స్వాధీనమందే ఉంచుకొని, శాస్త్రీయపరిశోధనలను తమకు తోడుచేసికొని, సంఘమునంతనూ యధోగతి పాల్జేసి, తామొక్కరే భౌతిక సుఖములకన్నిటికీ యేకమాత్రాధికారులై యున్నారో, వారంతే, నీబుద్ధిని, శాస్త్రపరిజ్ఞానాన్ని హర్షింప వలంచక, పీడితులై యధోగతిలో నున్న సామాన్య ప్రజాసంఘమును సహాయముజేయుటకై, నడుముగట్టి, ముందునడుగుతావు.

అప్పుడే, నీ కర్తవ్యాన్ని నెరవేర్చిన వాడవౌతావు. నీ పనులకీ, నీ విశాలమనో భావాలకీ, పరస్పర వైరుధ్యముండదు. ఇదివరలో నీవెన్నడూను స్వప్నేపి అనుభవింపని, సంతృప్తిని, ఆనందమును, గుర్తింతువు. ఆ రోజు వచ్చినపుడు... యేపక్షములోనైనను ఆనసము అట్టిమార్గములో లేదనియే నా నిశ్చయము ...ఆరోజు వచ్చినపుడు......నీవు యే సాంఘిక మార్పులను కోరుచుంటివో, అట్టిమార్పులు కలిగిన రోజు వచ్చినపుడు ...... శాస్త్రీయ పద్ధతులపై ఐకమత్యముతో పని చేయుటవల్ల అనుపమాన సత్వముగలదై, కోట్లకొలదిగానున్న కార్మిక కర్షకవర్గము నెరవల్ల, సానుభూతివల్ల, విపరీత వేగముతో తోసికొని వచ్చుచున్న, ఆ దినము వచ్చినపుడు, ...... వాస్తవము చెప్పవలసి వచ్చునో, ఆరోజుననే, ప్రకృతిశాస్త్రములు నిజమైన, అభివృద్ధి గలవగును. ప్రస్తుతము యీ శాస్త్రీయ విషయముల యభివృద్ధి, అప్పటి పరిస్థితులతో పోల్చిచూచినచో, చిన్నపిల్లల, విద్యార్థుల యత్నములవలె తోచకమానవు.

ఆలోచనచే, నీవు శాస్త్రీయజ్ఞానము వల్లగలుగు ఆనందమును, నిజముగా అనుభవింపగలుగుదువు. ఇప్పటివలెగాక, ఆ యానందము, నీ తోటి మానవులందరకునూ కెందును.

## న్యాయవాది యువకులకు.

నీవు న్యాయశాస్త్రమును చదువుట పూర్తియై, త్వరలోనే న్యాయవాదవృత్తిని స్వీకరింపబోవు చున్నావు గాబోలు. బహుశః, నీ భవిష్య జీవితమును గురించి, నీలో, కొన్ని ఉన్నతాశయములతో యుండి యుందువు. నేననుకోవడం, ... నీవు విశాలాంతఃకరణ గల వారిలో ఒకడవనీ, స్వార్థత్యాగము, పరోపకారమూ మొదలగునవి, నీ నిఘంటువులో వ్యర్థమగు మాటలు మాత్రమే గావనీ, నీ జీవితము నంతనూ, అన్యాయమును నిర్మూలించుటకైయే వినియోగపరచెదవనీ, నీ బుద్ధిచాతుర్యము నంతను న్యాయ చట్టముయొక్క వ్యవస్థాపనకైయే వెచ్చింప గలవనియూ, యంతకంటే, మానవ జీవితమునకు ఉన్నతాదర్శము, సార్థక్యమూ, మరేదియూ, యుండజాలదనియు, నీవు భావించుచున్నావా? కాని, నీయందును, నీవు కోరుకున్న జీవిత విధానమునందును, సంపూర్ణవిశ్వాసముతో, యీ జీవిత రంగములో ప్రవేశించు.

బాగుంది; న్యాయస్థానవార్తలను గలిగియుండు, నాయసంఖ్యాకమగు పెద్దపుస్తకములలో, యేపేజీలోనైనాసరే, వాస్తవముగా మానవ జీవితము నెదుర్కొను సమస్యలను గూర్చి విచారింతము

ఇదిగో. ఈ కేసు చూడు. ఇతడొక ధనికుడగు భూస్వామి: తన శిస్తును చెల్లించని, ఒక నిరుపేద రైతును, తన భూమిలోనుండి వెళ్లగొట్టవలెనని యీతడు కోరుచున్నాడు. న్యాయశాస్త్రరీత్యా యిందులో విశేషమేమీ లేనే లేదు. అతడు శిస్తు, చెల్లించలేదు. ......చెల్లించలేదు... గనక ఆతడు భూమిని వదలివైచి వెళ్లిపోవలసినదే. కాని, యీ సందర్భ

ములో, వివరముగా కనుక్కుంటే, కొన్ని, యిల్లాంటి సంగతులు తెలుస్తాయి; ఈ భూస్వామి, యెన్నడూనూ, ఆ భూఖండమును అభివృద్ధిలోనికి దెచ్చుటకు, యేమియుజేసియుండ లేదని; గత యేభై, అరవై సంవత్సరాల లోనూ, రైలుమార్గములను నిర్మించడమువల్లనో, క్రొత్త రోడ్లను వేయుట వల్లనో, మురుగునీరు పోవుటకు సౌకర్యములు గల్పించుటవల్లనో, ఆచుట్టు పక్కలనుండు యితర భూములను గూడ బాగులోనికి దెచ్చుటవల్లనో, మరేకారణము వల్లనైతే నేమి, ఆ భూమి ధర మూడు రెట్లు పెరిగిందనీ; కాని యీ భూముల యభివృద్ధికి, తరములనుండి రక్తమును చెమటను ధార పోస్తూన్న రైతు, షావుకార్ల చేతులలోబడి, ఋణములతో తలమునిగి, శిస్తును చెల్లించ లేకుండా పోయినాడు. చట్టము యెప్పుడూ ఆస్తి పక్షము లోనేయుంటుంది; అందులో సందేహమేమీ లేదు. భూస్వామిదే పరిపూర్ణమైన హక్కు, చట్టం ప్రకారముగా. కాని, నీవు, యేమంటావు? బహుశా, యీ న్యాయశాస్త్రములనే, కల్పిత శృంఖలలు, నీ మనస్సు నింకనూ బంధించియుండవు. ఆ రైతును, కట్టుగుడ్డలతో, గంపెడు పిల్లలతో, నిరాధారముగా రోడ్డుమీద నిలువ బెట్టాలి అంటావా? అదేకాదా, యీ న్యాయ చట్టం కోరేది? లేదా యే రైతుయొక్క కాయకష్టమువల్ల నా భూమి ధర పెరిగినదో, ఆతనికి, భూస్వామి చేత, ఆభూమి యొక్క పెరుగుదల ధర ముదరా యిప్పించాలి అంటావా? సర్వోత్కృష్టమైన న్యాయమే ఉంటే, కోరేది ఆదే కాదా? సర్వ సమానత్వము కోరేది అదే గాదా? నీవు యే పక్షం, చేకొంటావు? చట్టమునకు అనుకూలముగానూ, న్యాయముకు వ్యతిరేకముగానూ ఉంటావా? లేదా న్యాయమును అనుకూలముగానూ, చట్టముకు వ్యతిరేకముగానూ పనిచేస్తావా?

లేక మరొక ఉదాహరణ తీసికో ఆ మిల్లులో పనివాళ్లు, ముందుగ నోటీసు చేయకుండానే, సమ్మె జేసినారు. నీవు యే పక్షములో పని చేస్తావు? చట్టము ప్రకారం, అంటే తనకున్న కొన్నిహక్కులనో,

సౌకర్యములనో, పురస్కరించుకొని, యే కరువులోనో అమితలాభములను పోగుజేసుకొన్న, యజమాని పనిజేసెదవా? లేక చట్టమునకు విరుద్ధముగా నైన లెక్కజేయక, దినమునకు ఆరణాలకూలికై శ్రమశక్తిని విక్రయించి, తమ భార్యా పుత్రులు తమ కండ్లయెదుటనే పస్తుండి పోవుచుండ, యజమానికై యహోరాత్రములు పనిచేసి, యమిత లాభములను సమకూర్చు, ఆ బీదకార్మికుని పక్షమున జేయుదువా? చట్టములోని Freedom of contract మొదలగు తియ్యని, మోసపు మాటలను, నీవును సమర్థింప జూతువా? లేక, మానవులలో సర్వసమానత్వమను పరమసత్యమును; యే సత్యమును దృష్టిలో నుంచుకొని చూచినచో, కడుపునిండ కుడిచిన వానికిని, పూటగంజికై తన అమూల్య కష్టమును విక్రయించుకొనువానికి, బలవంతునికిని, బలహీనులకును, మధ్య జరిగిన కంట్రాక్టు కంట్రాక్టు యెట్లగునులే; ఆ సమానత్వమునే సమర్థింతువా?

పోనీ, మరియొక నేరము. అదే, బొంబాయి నగరములోని పెద్ద హోటలు. యెంత పెద్ద సౌధము, ఎన్ని సౌకర్యములు, యెందరు పరిచారకులు, యెంత రుచికరములగు పదార్థరాసులు! చినిగిన గుడ్డలతో తక్కుచు, తారుచు, నాతడు పరుగెత్తుచున్నా డేమిటి? ఆ, తెలిసినది; పెద్దరొట్టె నొకదానిని దొంగిలించుకొని బోవుచున్నాడా! పాపము, ఆతడెవరో తెలిసికొందము. పనిలేక యున్న, ఒక స్వత్రినిపుణుడు. కొద్దిరోజులనుండి ఆతడు నిరుద్యోగి యగుట వల్ల, నాతని భార్యా పుత్రాదులతో నాలుగు దినములనుండి పస్తున్నాడుట! నిజమే! ఇట్టి వారెందరో యున్నారు. వానికీ దుర్బుద్ధి యేమిటంటారా! ఆతనిని యెరస్టుచేసి, న్యాయస్థానమునకు గొనిపోయిరి. వానిపై జాలిదలచి వానిని వదలివేయ వలసిన దని హోటలువానిని కోరిరి. గాని, ఆ పెద్దమనిషి సమ్మతించలేదు. ఆతనికి న్యాయమే నట గావలసినది! ఆతడు దోషియని నిర్ధరించి, ఆరుమాసములు కఠిన శిక్ష విధించిరి. న్యాయము, చట్టము, గుడ్డివి కావేమిటి?

ఇట్టి తీర్పులు, నిత్యమునూ, యెన్నో చెప్పబడుచున్నవని, విన్న తరువాత నైన, నీకే యంతరాత్మ యనునది యున్నచో, తప్పక, వాటిపై నెదురు తిరుగుదువు

లేక మరొకటి. ఆతడు చిన్నప్పటి నుండియు, అదృష్టములు లేక పెరిగినాడు. బాల్యమునుండియు చాలకష్టములు పడుతూ, అందరిచేతనూ నిరసింపబడుచు, యెవ్వరును ఆదరించువారు, కడుపునిండ మాటలు చెప్పువారును లేక, యెట్లో పెద్దవాడైనాడు. ఆఖరున ఆతడు చేసినదేమిటి. ఒక్క రూపాయిని దొంగిలించుటకై యిరుగుపొరుగువాని, నిండు ప్రాణమును దీసినాడు. ఆతనిమీద కూడ చట్టము ప్రయోగింప బడవలెననియే కోరుదువా? ఆతని నురిదీయవలెనని విధింతువా, లేక అంతకన్న నీచముగా ఆతనిని యావజ్జీవము చెరసాలలో నుంచవలెనని విధింతువా? ఆతడు నేరస్థుడా, లేక పిచ్చివాడా? ఏమి మాట్లాడవేమి? ఏది యెట్లున్నా, ఆతనియందు, మానవత్వమును నశింపజేసిన, యీ సంఘముదే, యీ తప్పు గాని, ఆతని దొక్కరిది మాత్రము గాదనుట నిశ్చయముగా చెప్పగలము.

నిరాశులై, యిల్లుకు నిప్పంటించిన యీ నేతగాండ్రు, కూలీలు, అందరూ జైలులో త్రోయబడవలెనని, యందువా? లేక యీ ఘోరాన్యాయములను ఆటంకములను నిరసించుచు, భవిష్యద్ధ్వజమును నాటిన యీ ధైర్యశాలులగు వీరులను, కాల్పించివేయాలి, యందువా? కాదు, కాదు, అట్లనవు; వేయిసార్లకు కూడ అట్లనవు.

నీకు నేర్పబడిన వాటినే, చిలుకవలె తిరిగి పలుకుటతో తృప్తి బొందక, తర్కించుకొనెదవేని; న్యాయచట్టమును కప్పియుంచిన ఆ పొరను తొలగింతువేని; నీవేమి చూడగలవు? చట్టమునకు మూలమేది? బలవంతుల హక్కులుగాక మరేది! చట్టమునకు ప్రయోజన మేది? బలవంతులు, బలహీనులను అణగ ద్రొక్కుటయే; 'మానవజాతియొక్క కడు

దీర్ఘమై రక్తప్లావితమైన చరిత్రలోని, పీడితులకు చేసిన ఘోరతర అన్యాయములకు, అర్థమును కల్పించుటయే! నీ వప్పుడైతే దీనిని తెలిసికొన్నావో, అప్పుడే, న్యాయచట్టమునందు నీకు, అసహ్యత, ఏవగింపు కలుగు తీరును. అందులో ఆశ్చర్యమేమున్నది? పుస్తకములలో వ్రాయబడి యున్న చట్టములకు వ్యతిరేకముగా వర్తించుటయన్న, అంతరాత్మకు వ్యతిరేకముగా, అన్యాయమార్గమున చరించుటయని, నీవు గ్రహింతువు. అందులో విశేషమేమున్నది? తరువాత నీలో యీ జిజ్ఞాసతో కూర్చుంటావా? నీ అంతరాత్మ ప్రబోధమును తృణీకరించి, మోసగాడవేనా అవుతావు, లేదా, యీ అంధ పరంపరను ఛేదించి, నీవు మాతో బాటుగా చేరి, యీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ దురన్యాయములను సంపూర్ణముగా నాశనము జేయుటకు పని సేయుదువు.

కాని అప్పుడు నిన్నేమంటారు? సోషలిస్టువనీ, విప్లవకారుడవనీ, యింకా యేమిటో!

తరువాత నీ సంగతయ్యా, యింజనీరింగు విద్యార్థీ. పాపము, నీ ఉద్దేశ్యములు మంచివే; శాస్త్రీయ విషయములను, పరిశ్రమలలో ప్రవేశపెట్టి, శ్రామికుల కష్టములను, సాధ్యమైనంత వరకు తగ్గింపవలెననియే నీ యూహ. అయ్యయ్యో, నీ యూహలు వ్యర్థములని తెలిసికొనుటకు, నీ తెలివితేటలు మానవులను యింకనూ కష్టములలోనే ముంచివైచునని తెలిసినపుడు, నీ వెంత విచారించెదవో. ప్రకృతిచేత వేరు చేయబడిన రెండు దేశము లున్నవి. వాటికి రాకపోక సౌకర్యములు కలుగజేసి, వారిలో సోదరభావమును, పరస్పర సాహాయ్యము పెంపొందింపవలెనని చూతువు. అందుకొరకై పర్వతములను బ్రద్దలుకొట్టి, అగ్రముల చివరగా, నదులపైగా, ఎన్నో చిక్కులు దాటి రైలుమార్గము నిర్మింపవలెను. మార్గము ప్రారంభింపబడినది. వేలకొలది కార్మికులు రెక్కలు ముక్కలు చేసికొంటున్నారు. సొరంగములలో, చలిజ్వర ప్రదేశములలో, నదులపై

చాల ప్రమాద కరములగు చోట్లలో పని చేయుచున్నారు. ఆ పనివారి కుటుంబములు వందలకొలది, వేలకొలదిగా, యీపనిలోనే తమ చెమట నోడ్చి, రక్తమును ధారపోసి, కడకు ప్రాణములను గూడ గోల్పోయిరి. యేకొద్ది మందియో మాత్రము, పది, నాల్గురూకలనో, మితిమీరి పనిచేయుటచే క్షయనో మూట గట్టుకొని, జవసత్వములుడిగి, తమ గ్రామములకు, అల్ప సంతోషులై పోవుచున్నారు, ఎట్టకేలకు రైలు మార్గము నిర్మింప బడినది. కాని ప్రతియంగుళమును మానవ అస్థికలచే భీతి గొల్పు చుండలేదా? దీని కంతకును కారణమేమి? మానవుని యందు మితి లేకుండా పెరిగిపోయిన లాభ కాంక్ష కాదా? తుదకు ఆ రైలు మార్గము యొక్క ప్రయోజన మేమి? దేశములను జయించుటకై సైనికులను తీసికొని పోవుట కుపయోగింప బడుచున్నది. యోచితివా, నీ మేధా శక్తికి, నీ విరామ మెరుగని పరిశోధనలకు ఫలిత మేమో? ఇదే నా నీవు కోరినది?

నీ జీవనము నంతనూ పరిశోధనలతోనే గడపితివి. ఉత్పత్తి విధానములను సౌకర్య యుతము గావించి, మానవ సంఘముకు కావలసిన వస్తు సముదాయమును, తక్కువ కష్టముతో సృష్టించుటకే గదా నీ యాశయము. ఎన్నో శ్రమలు జెంది, ఎన్ని రాత్రులనో ఆలోచనలతో గడిపి, తుదకు, నీ పరిశోధన పూర్తి చేసితివి. ఫలితమును ఆచరణలో పెట్టించితివి, గాని పర్యవసానము నీ తలను మించి పోయినది. వేలకొలదిగా జనులు పనిలేక కుంటి బోవుచున్నారు. ఇంక పనిలో నున్నవారా, చిన్నపిల్లలు. వారైనా కేవలమూ యంత్రములుగా, కీలు బొమ్మలుగా చేయబడినారు! ముగ్గురో, నల్గురో, అథవా యేపదిమందో పెట్టుబడిదారులు, కోట్లు గడించి, సీసాలతో షాంపేన్ త్రాగుట మొదలు పెడతారు. దీనినేనా నీవు ఆరాధించినది, వాంఛించినది. ఎట్టి దారుణ స్వప్నము!

ఇన్నిమాట లెందుకు. ఆధునిక పారిశ్రామికాభివృద్ధి గూర్చి చదివిచూడు. కుట్టుడు యంత్రము కనిపెట్టడం వల్ల, దర్జీవాని కేమి లాభము గలిగినది. ఏమీలేదు. దయమండు ట్వీల్లుగుడ్డలు కట్టు కొంటూనే యున్నాడు గాని, St. గోథర్డు సొరంగములోని కూలివాడు, యాంకిలోస్మా చేత చనిపోతూనే యున్నాడు. గోజు కూలీలు, మేస్త్రీలు, అందరూ పనేమీలేక, మాడుతూనే యున్నారు. నీవు యెట్టి తీవ్ర మేధతో, యెట్టి నిష్పక్షపాత బుద్ధితో పారి శ్రామిక సమస్యల నాలోచించితివో, అట్టి బుద్ధితోనే సాంఘిక సమస్యలను గురించి ఆలోచించినచో, యిందులో మూల సూత్రము నీకు బోడగట్టక పోదు. ప్రత్యేకపు టాస్తులు (Private property) (wage labour system) కూలి పద్ధతి, యీరెంటును సంఘములో నున్నంత కాలమును, ప్రతి క్రొత్త పరిశోధనయు, కూలీ జనముయొక్క సౌకర్యమును వృద్ధి జేయుటకు మారుగా ఆతని జీవితమును నాశనము చేయుచున్నది; నిరుద్యోగము నెక్కువ జేయు చున్నది; ఆతని బానిసత్వాయి నభివృద్ధి జేయు చున్నది; ఆతని కష్టమును నీచత్వముకు గురిజేయు చున్నది; కరవును యెక్కువ జేయుచున్నది. ఇంతేగాక యిది వరలోనే సోమరియై సుఖానందములలో మునిగి తేలుచున్న వానినే యింకను అభివృద్ధి లోనికి గొంపోవుచున్నది.

ఈ విషయములను తెలిసికొన్న తర్వాత, నీ వేమి నిశ్చయింతు కొందువు. బహుశా నీ యంతరాత్మను, శుష్క వేదాంతముచే అణచి పెట్టి, స్వార్థ పరుడవై పోదువు. ఒక శుభ దినమున, నీ చిననాటి విశాల భావములకు స్వస్తి చెప్పి కేవల స్వార్థ సుఖానందములకై పాటు బడుటకై, అంటే, నీవు కూడ యీ ప్రత్యక్షదోపిడి గాండ్రకూటములో చేరుదువు. లేదా, నీవే మృదుల హృదయుడవగుచో, యిట్లను కొందువు. "కాదు, యిది నవీనశాస్త్ర పరిశోధనలలో కాలము పుచ్చవలసిన

సమయముగాదు. మొట్టమొదట వస్తువుల ఉత్పత్తి విధానములో నున్న లోపములను సవరింప వలెను. ఎప్పుడైతే ప్రత్యేకపు టాస్తి లనుమాట లేకుండ జేయగలమో, అప్పుడే, ప్రతి నూతన పరిశోధనా ఫలితమును, మానవ సంఘమున కంతకును జెందు తుంది. ప్రస్తుత ధన స్వామ్య సంఘంక్రింద కేవలమూ యంత్రముల కన్న అస్వతంత్రులై, వ్యక్తిత్వములేని యీ కోట్ల కొలదిగా నున్న కూలీలు, అప్పుడు, ఆలోచించి పనిచేయగల సమర్థులై, చదువుట చేతనూ, అనుభవము చేతనూ గడించినధీ శక్తిని, పారిశ్రామికాభివృద్ధికై వినియోగించ గల వారగుదురు. మనము స్వప్నేపి, యూహించ జాలనంత యభివృద్ధికి, ఒక అర్థ శతాబ్దములోనే, యంత్ర సాధనములు ముందుకు బోయి తీరును.

## బడిపంతులు.

ఉపాధ్యాయులకు, నే జెప్ప వలసిన దేమిటి ...... యెవరు తమ వృత్తిని, నీచమై, బాధాకరమగు వ్యాపారంగా యెంచు కుంటూంటారో వారికి గాదు, నే జెప్పేనది ...... మరి యెట్టి వారికీ అంటే, యెవరు, నిర్మలానంద పూరితులై, అమాయక మగు చూపులతో, వికవిక నవ్వుచు, చక్కని పిల్లలు తన చుట్టూ కూర్చున్నపుడు, తన చిన్నతనంలో తన కెట్టి విశాల భావములు, మానవ సేవాదీక్ష యుండెడివో, అట్టి భావములనే వారి చిన్న తలలలో జొప్పించి, వారిని కాగల భాగ్య శాలులుగా తయారు జేయుట యెట్లా యని ఆలోచించు, ఆ ఉత్తమ గురువులకే.

తరచుగా, నీవు విచారంగా ఉన్నట్లు కన్పడుతూన్నావు. నీ కనుబొమలు యెందు కట్లా ముడివైచు కొంటూన్నావో నాకూ తెలుసునులే, ఆ కుర్రవాడు నీకు చాల యిష్టుడనుకుంటాను, అతడు సంయోజన వ్యాకరణ సూత్రములను చదువుకొని రానిమాట నిజమే. కాని ప్రతాపసింహ చరిత్రములోని యీ రెండు పంక్తులను తప్ప జెప్పినపుడెట్టి యుద్రేక

మును చూపెను. అక్కడే, అప్పుడే, ఆ క్రూరాత్ముల వంచనను కత్తి తీసికొని పొడువ గోరెనో, అన్నట్లుండ లేదా? అతని కండ్లు మెరసెను. కంఠములో మనః భావ పూరిత మగు పదము వచ్చెను. ఉద్రేకముగా చదివేడు :—

కాని యింటికి పోయిన తర్వాత నాతని తల్లి, దండ్రి, మామ కూడ అతనిని చీవాట్లు పెట్టిరి. బలవంతులుకి, మత గురువులకు, పల్లెటూరి అధి కారుల గౌరవము చూపాలని చెప్పిరి. అధి కారుల యెడ భయ భక్తులు, పెద్దల యెడల అణకువ, సంసార పక్షంగా ఉండడం మొదలగు మహా విషయములను గూర్చి, చెవులు తడకలు కట్టేలా ఉపన్యాసాలు కొట్టారు. పాపం. ఆకుర్రవాడు హడిలి బేజారెత్తి పోయాడు. స్వాతంత్ర్య భావ బోధకమగు నా పత్రమును క్రింద బెట్టి, స్వయం సహాయమునో మరేదో పుస్తకమునో తీసికొను వరకూ, వాళ్ల చీవాట్లు శాంతించ లేదు.

ఇంకో టేమిటీ, అంటే, నీ దగ్గర చదువు కొన్న వాళ్లలో ఘట్టి. వాళ్లని, నీ వనుకొన్న వాళ్లంతా పరమ నిర్భాగ్యులుగా తయారైనారని, నీవు విన్నావు కాదా? ఒకడు తనకేదో పెద్ద ఉద్యోగము రావాలి అనే దివా స్వప్నములు కంటూండడం కంటే మరేమీ ఆలోచించడమే లేదు మరొకడు గుమాస్తాపని చేస్తూ తన యజమానితో బాటుగా, కూలీల కిచ్చే బేడ డబ్బుల్లోంచే, మామూళ్లు, పేరుచెప్పి కక్కుర్తిపడి, వాళ్ల పొట్ట కొడుతూనాడు. నువ్వనుకొని ఉంటావు, వీళ్లంతా తెగచదివి, మానవ సంఘాన్నంతనీ ఉద్ధరించేస్తారని. కాని, నీ వూహాలు నిరాధా రము లయాయి. దాన్ని గురించే, నీ విపుడాలో చిస్తూనావు. నాకు యిట్లా పొడగట్టుతూంది. ఇంకెన్నో రోజు లవసరం లేదునే, మహా అయితే యే యేడాది లోనో, నీవు యిట్లా తలచీ రోజు వస్తుందేమోననే నాభయం. నీవు మహా పొడి చేస్తారనుకున్న యువకులంతా యీవిధంగా, నీ ఆశయాలను విఫలం చేయడం చూచి మూచి ప్రాణం విసిగి, యిల్లా అను

కుంటావు. "ప్రతాప సింహుడు చాల స్వాతంత్ర్య ప్రియుడే కాని పూర్తిగా ప్రపంచకజ్ఞానం తెలియని 'క్రాక్'. పగల్లా యే రూలు ఆఫ్ త్రీయో పిల్లలకి నూరిపోసి యింటికొచ్చిన తర్వాత, యేమంచము మీదో పడుకొని మననం చేసుకునేందుకే కాని యీ కవుల వ్రాతల ఉపయోగం యేమీ లేదు. కవులంతా, మేఘాల్లో వివరిస్తూంటారు. మన నిత్య జీవితానికీ వాళ్ల రాతలకీ యే సంబంధమే లేదు. ఒక వేళ దానికి సంబంధం ఉంటే ఉండొచ్చునుగాని కవుల రాతలకి, రేపొచ్చే స్కూళ్ల యిన్స్పెక్టరు పరీక్షకీ అసలే సంబంధం లేదు. నాకెందుకొచ్చినవీ గొడవలన్నీ" తప్పదు. అందరిలాంటి వాడవే అయితే ఇంతే అనుకుంటావు.

గాని, నీలో మానవత్వమూ, పౌరుషమూ, యేమాత్రమున్నా, నీలో నేటి శిక్షణమే ప్రవహిస్తూంటే, నీవయస్సు తిరిగిపోయినా ఫర్వాలేదు, నీ యౌవనంలో, నీలో జాగృతాలయిన ఉన్నతాశయాలసిద్ధికై పనిచేయ నిశ్చయించుకుంటావు. పిల్లలందరికీ, స్కూళ్లలోనూ, యింటివద్దాకూడా విశాలాభిప్రాయాలను కలుగచేసీ, మానవత్వాన్ని పెంపొందింపచేసీ, విద్యే కావాలంటావు; అట్లాంటి సౌకర్యాలు, యీ ప్రస్తుత ధనస్వామ్య సంఘంలో యెప్పుడూ కలుగచేయ బడవు, సహింపబడవు, అని తెలుసుకుంటావు, వెంటనే యీ సంఘ విధానాన్ని తీవ్రంగా విమర్శిస్తావు. విద్యాశాఖవారు వెంటనే, నిన్ను పనికిరాని వాళ్లలోనూ, రౌడీ ముండా కొడుకుల్లోనూ జమవేసి, వాళ్ల లిస్టులోంచి తప్పించుతారు. బ్రతుకు జీవుడా అని, ఒక్క నిట్టూర్పు పుచ్చి, నీ కార్యక్రమాన్ని ప్రారంభించుతావు. వయస్సులో నీకంటే పెద్దవాళ్లయినా, నీ దగ్గర చదువుకో దగ్గ వాళ్లందరికీ, నీవు చెప్పడం ప్రారంభించుతావు! యేమిటా! మానవసంఘం యెట్లా వుండాలో, కాదు, కాదు; యెట్లా వుండడానికి అవకాశాలున్నవో, అనియే. అంటే, నీవుకూడా, యీ సోషలిస్టులలో చేరి, యీ అవక తవక సంఘంయొక్క మూలమట్టాన్ని కూలత్రోయడానికి

ప్రయత్నిస్తావు. అంటే యీ ప్రపంచములో మానవ జాతికి నిజమైన స్వాతంత్ర్యము, తరుగులేని స్వాతంత్ర్యము, నిజమైన సౌభ్రాతృత్వమూ, నిజమై సమానత్వమూ కలుగ చేయడానికి మాతో చేతులు కలిపి పనిచేస్తావన్నమాట.

## ఇంక కళోపాసకులు.

ఓ యువకులగు చిత్రకారులారా, శిల్పులారా, గాయకులారా; కవి వతంసులారా! మీ పూర్వులనే పవిత్ర భావములు ప్రేరేపించినవో, అట్టివి మీయందు, వెతికినా గాన్పించడము లేదు. కళ వెనుకటికి వలెనే మానవులకు ఆనందము గల్గించెడిదే! సర్వప్రజలకూ సమానహక్కే! గాని దశాకి వ్యాపారమే యెక్కువగా కనిపిస్తూంది, ప్రస్తుతపు కళలలో.

మరొకలాగట్లావుంటుంది; కళలోని, విప్లవకరశక్తి నశించిన తర్వాత, యింతకంటె యెక్కువ యెల్లా వుంటుంది. మధ్యమ యుగంలో సృష్టికి ప్రతి సృష్టి చేసిన చిత్ర కళ, నీచ దృశ్యాలని చిత్రించడతో సంతృప్తి పొందుతూంది; కవిత్వం, యే వేశ్య శయనాగారానో, త్రాగుబోతుల సైనానో, సవిమర్శగా వర్ణించుతూ, పశుప్రవృత్తిలోనికి దిగింది.

అట్లాగయితే యేమి చేయమంటావన్నావా, మరి. అనేనా నీ ప్రశ్న. నా సమాధాన మేమిటంటే, నీ లోని పవిత్రాగ్ని, ఆరిపోయియుంటె నీవు యేం చేస్తూంటావంటే, యిదివరకు దాకా నీవేం చేసేవో దానినే. నీకళ యెందుకు పనికివస్తుందంటె నర్తకుల అంగళ్లలో అలంకరించడానికే; నీ కవిత్వము, సంక్రాంతికి పత్రికలలో చిట్టి కథలు వ్రాయటానికే; అధమాధమ దరగతిలో చేరదగు నాటకాల్లో వేషాలువేయడానికి నీ సంగీత, నాట్యకళలు; మీరప్పుడే యిల్లాంటివాళ్లుగా తయారవుతూనే వున్నారు. మీకళలు కొడిగట్టు దీపాలలాగ జ్యోతిక్షీణములుగానే వుంటున్నాయి.

కాని నీకే హృదయమున్నగా ఉండి. అది మానవత్వానికి నిన్ను త్వరపెడుతూవుంటే, నిజముగు కవికివలె, నిత్య జీవితమును తిలకించ గలుగుదువేని నీ కగపడునదియేమిటి? లోకమంతయు దుఃఖపూరితమై, ప్రతిచోటను మానవుడు బాధింప బడుటనే చూడగలవు. ఇక్కడ మనుష్యులు, ఆకట చచ్చుట చూడగలవు. మరొకచోట గనులలో మానవ కళేబరములు గుట్టలుగా బడియుంట వీక్షింతుము. వీరత్వము, దేశాభిమానము అను మోసపు మాటలచే, యీ అసంఖ్యాకపు అమాయికులను యుద్ధరంగములలో లక్షల కొలదిగా చంపించుట చూతుము. ఇదిగో, యెవరీ బారులగట్టి, భారములగు సంకెలలను యీడ్చుకొనుచు వరుసలుగాబోవుచున్న, యీయువకులు? విదేశములలోను, సముద్ర మధ్యమందలి దీవులలోను నున్న అడవులమధ్య జైళ్లలోను, విప్లవ కారుల క్యాంపులలోను నుంచబడుటకై ప్రవాసులా యేమి! పాపం వారిమాతృ భూమి నుండిగొనిపోబడు చున్న, యీ అమూల్య హృదయములు, అమానుష బాధలచే నవసిపోయి ఆ అరణ్యములలోనే రాలిపోవును. యేమానవుల క్షేమాభి వృద్ధులకై వారి ప్రాణములను ధారపోసిరో, వారిస్వసుఖముల నుజ్జగించిరో, అట్టి దీనులు మేల్కొనక పోవుట చేతనే వీరి కీగతి। గదా!

ఓమానవుడా! యీ సంఘములో నిత్యము జరుగుచున్న యీ అసమ పోరాటము సమయములో నీవు తటస్థుడవుగా నెట్లుండగలవు? మహాస్థైర్యము, నీచపు పిరికి తనమునకు జరుగుచున్న; మహోన్నతా దర్శములకును మిక్కిలి నీచమగు పిరికి స్వార్థమునకును జరుగు యీ పోరాటములో, తటస్థముగా నున్నచో, నీలో మానవత్వమున్నదని, యెట్లనుకొనుట? లేదు, లేదు, నీవు తటస్థముగా నుండలేవు, నీవుతప్పక, అధర్మముచే శాసన మొందింప బడుచున్న యీపీడితుల పక్షమున చేరుదువు. జయింపబడిన వీరి శిబిరమునుండి యెట్టి భయంకర ఆర్త నాదములు! కాని యేమి ఉన్నతా ధర్మముల శక్తి! ఎవరు జ్ఞానజ్యోతికై, మానవసం

ఘమునకై, పవిత్ర న్యాయమునకై పోరాడుచున్నారో, వారే ధన్యులు సుందరజ్యోతి ర్మూర్తులు! అట్టివారి పక్షమున చేరుట, నీకర్తవ్యమని మరొకరు చెప్పనవసర మున్నదా?

ఏమి టిది చేయవలసినది ? ఆఖరుకు నీవు, నన్ను ఆపివేస్తావు.

'ఏమిటోయి, ఈ గొడవంతాను' నీ వంటావు. 'శాస్త్ర పఠనము, పరిశోధన, భోగానుభవమే అయితే; వైద్యవృత్తి, మోసము, కళ్లనీళ్లు తుడవడమూ అయితే; న్యాయవాదివృత్తి, అన్యాయాన్ని నిరంకుశంగా సాగించడమే అయితే; మానవుని శ్రమను తగ్గించుటకు కనుగొనబడు యంత్రములన్ని, దోపిడీ మార్గములే అయితే; పిల్లలలో సరియైన విజ్ఞానమును వ్యాపింపజేసి, కర్తవ్య బోధ చేయడానికి స్కూళ్లు పనికిరావంటే; కళలలో, పవిత్ర విప్లవాగ్నియే లేనిచో, ఆ భాసమాత్రమే వని నీవు చెపుతూన్నదే! అయితే చేతులు ముడుచుకొని కూర్చోమంటావా? కళ్లు మూసుకుని నిద్ర బొమ్మంటావా?'

ఓరి పిడుగా! నీకు యేం చెయ్యాలో చెప్పనే లేనా? చేతినిండా ఉంది పని. అందులో నీ చేతలు, నీ అంతరాత్మ ప్రబోధంతో పూర్తిగా ఏకీభవిస్తాయి. ఎందరో చురుకైన వాళ్లను, ఉన్నతాత్ములను, యీ పనిలో పవిత్రజ్యోతి పెనిరేపుణ కాల్పిస్తూంది.

ఏమి టాపని. ? ఇదుగో చెప్తున్నా.

ఇదిగో రెండే మార్గాలు. మూడోది లేనేలేదు. నీ అంతరాత్మను చంపివేసికొని, నీ ఉన్నత ఆదర్శములను శాశ్వతముగా స్వస్తి చెప్పి "పోనిద్దూ! నామటుకు నేను సుఖంగా, నా జీవితాన్ని ఆనందంగా గడపుతూన్నంత కాలమూ, యీ మానవులంతా, యే గంగలో దిగితే నా కేమి? ఈ మూర్ఖులంతా, చపట లైపోయి, నన్ను స్థిమితంగా అనుభవించ నిచ్చినంత కాలమూ, నాకీ గొడవలన్ని యెందుకు.' అని అనేస్తావు.

లేదా, మరొక మార్గ మేమిటంటే, నీవు, యీ సోషలిస్టులలో చేరి, యీ పాడుపడిపోయిన సంఘము, పూర్తిగా మారిపోవునట్టు చేయడానికి పాటుపడతావు. నీవు నిష్పక్షపాత బుద్ధితో ఆలోచించినట్లయితే, యీ నిశ్చయానికే వస్తావు. నీవే అన్నమాటేమిటి! ప్రతి తెలివైనవాడూ, యిట్టి నిశ్చయానికి రాకమానడు. అయితే ఒక్కటి; స్వార్థపరత్వబుద్ధితో కూడిన స్నేహితుల సలహాపై నీ బుద్ధి ఆధారపడకూడదు; నీ కున్న యీ మధ్య(middle class)తరగతి విద్యవల్ల నీకు పట్టుబడ్డ యీ తప్పు డభిప్రాయాలనీ, పెడదారినిబడ్డ సందేహాలనీ లెక్కజేయకూడదు.

అల్లారా, ఈ నిశ్చితాభిప్రాయానికి వచ్చిన తర్వాత, యింకో ప్రశ్న వస్తుంది. 'కార్యక్రమ విధానం యేమిటి, చెప్మా.'

ఇందుకు జవాబు చాల సులభము.

నీవు ప్రస్తుతమున్న స్థితిలోనుండి చూచినంత కాలమూ, కార్మిక కర్షకులంటే యేదో జంతువులనీ, మనకంటె భిన్నమైన వారనీ తలుస్తావు. అందుచే నీవు కూడా వాళ్లలో ఒకడుగా, యెప్పుడు తలుస్తున్నావో, అప్పుడే యిట్టి అనవసర ప్రశ్నలేవీ రావు.

ఇక్కడా, అక్కడా అన్న మాటేమిటి. అక్కడ యింగ్లాండులో యిక్కడ జర్మనీలో, అక్కడ యునైటెడు స్టేట్సులో యిక్కడ ఇటలీలో, అక్కడ చైనాలో, యిక్కడ యిండియాలో, యింకా ప్రతీదేశంలోనూ, యెక్కడెక్కడ పీడించీవాళ్లూ, పీడింపబడీ వాళ్లూ ఉన్నారో, అక్కడల్లా కార్మిక కర్షకులలో, ఒక బ్రహ్మాండమైన ఉద్యమం బయలుదేరి పనిచేస్తూంది. ప్రతీ దేశంలోనూ, వాళ్లలో ఆత్మ విశ్వాసము జాగృతమై యున్నది. ధన స్వామ్య ప్రభుత్వ విధానంవల్ల సామాన్యప్రజలపై విధింపబడిన బానిసత్వమును, శాశ్వతముగా వినాశ మొందింపజేసి, ఆ సంఘ అస్థికలపై నూతన సంఘము నొకదానిని, న్యాయము; సమానత్వము అను ఉన్నతాదర్శములపై నాధారపడియున్న కొత్త సంఘము నొక

దానిని, నిర్మాణ మొనరించుటే, మన యాదర్శము. సంఘంలో ఉండే అన్యాయాల్ని, బాధల్ని గురించి, హృదయాన్ని ద్రవింపజేసే, గీతాల్ని పాడుకుంటూ కూర్చుంటే, కాదు. అట్లాంటి గీతాల్ని 18 వ శతాబ్దంలో బానిసలూ పాడేవారు; ఇప్పటికీ అనేక చోట్ల, పాడబడుతూన్నాయి, పాటలతో మన కర్తవ్యం పూర్తికాదు. చేయవలసిందల్లా, తనను యెదుర్కొని, తనని శాశ్వతంగా బానిసత్వములోనే ఉంచేందుకు చేయబడే ప్రయత్నాల నన్నిటినీ చలించని ధైర్యంతో, ఆత్మ విశ్వాసంతో, త్రోసి రాజనడానికే పని చేయడము. ప్రతికోట యిట్లాంటి ప్రయత్నాలు తీవ్రంగా కొనసాగించ బడుతూనే ఉన్నాయి. యీ జీవితం, మానవ సంఘంలో మూఢమతుల మందికి యాతనా పూరితంగా ఉన్న యీ దుర్భర జీవితం, అందరకీ సుఖ సంతోషమయంగా, ఆశాపూరితంగా యుండునట్లు చేయుట యెట్లా? అనియే ప్రతివాడును యోచించుతూ న్నాడు. తన లోకజ్ఞానాన్ని, తన అనుభవాన్ని, తన దుఃఖపూరిత జీవితాన్ని ఉపయోగించి సాంఘిక జీవితాన్ని యెదుర్కొంటూన్న, కష్ట సమస్యల్ని విడదీయడానికే ప్రయత్నిస్తూన్నాడు. తనతో బాటుగా, దుర్భరజీవిత రంగంలో సహచరులుగా, నున్నవాళ్లతో తనకు యేకత్వము సిద్ధించుటకై, సంఘాల్ని స్థాపించుకొన ప్రారంభించుతాడు. ఏకైకా దర్శమునకై పాటుబడే వాళ్లందరూ ఒక్కసంఘంగా చేరి, విషమ సమస్యల్ని యెదుర్కొనడం నేర్చుకుంటారు. చాలీచాలని స్వల్ప విరాళాలపై ఆధారపడిన సంఘాల్ని, బహుకష్టంతో సాగిస్తారు. దేశవిదేశాల్లోనున్న, తన బోటి సోదరబృందాలతో సంబంధములు కల్పించుకుంటాడు. ఎట్లాంటి సాంఘిక వ్యవస్థ స్థాపింపబడినచో, యీప్రపంచములో ప్రబలియున్న అశాంతి, యుద్ధప్రియత్వము తొలగింపబడుతవో, అట్టిసంఘ నిర్మాణానికి అనుకూలనం త్వరలో రావడానికే, ఈతడు, యీ పెద్దకబుర్లు చెప్పే రాజనీతివేత్తలు, శాంతిమాతలు, మానవసేవకులు అనుపిలువబడే వీళ్లందరికంటె యెక్కువగానే పనిచేస్తాడు. తన తోటి సోదరులు విదేశాలలో యేం

చేస్తూన్నాడో తెలిసికొనుటకై వాళ్లతోగల పరస్పర సంబంధాలు వృద్ధిపొందుటకై, తనభావముల నింకను విశాలముల నొనరించుకొని, ప్రచారసౌకర్యముకై తన పత్రికను, అతికష్టముపై సాగిస్తుంటాడు. ఆతని శ్రమ, నిరంతర కృషి, యెట్టి ఉన్నతభావమూలకములు! ఎట్టి విసుగూ, విరామమూ లేని పోరాటము! నిరంతర కష్టాలవల్ల (Lassitude), తప్పుడు అభిప్రాయాలవల్ల, ప్రభుత్వ దౌర్జన్యాలవల్ల, స్వార్థపరులై కొందరు, మనల్ని విడిచి పోతుంటారు. ఒక్కొక్కప్పుడు తుపాకి గుండ్ల వల్లను, ఆకస్మిక దండయాత్రలవల్లా (Fusilades) చెదరి పోయిన, తన సంఖ్యలను తిరిగి కూర్చు కుంటూండాలి. ఒక్కొక్కసారి సమూహాపదలవల్ల పాడుబడి పోయిన స్టడీ సర్కిల్సును, తిరిగి సాగించు తూండాలి; ఎంత కష్టము! కష్టమైనా ఎట్లు తృప్తికరము!

ఈపత్రికలన్నీ నడపాలీ అంటే నిద్రాహారాలు కూడా వదలి పెట్టాలి; తిరిగి వార్తలన్నీ సంపాదిస్తూండాలి; యెన్నివిషయాలో చదివి, పాఠకులకవి సరిగా అందచేస్తూండాలి. తన జీవితావసరములకే, బానిసలై పనిచేస్తూన్న కార్మిక వర్గమంతా యీ ఆందోళనను సాగిస్తూంటారు. వాళ్ళు, కాని, కానిచొప్పున, విరాళాలు వేసికొని డబ్బుపోగుచేస్తారు. గంజిలో ఉప్పునైనా మానేస్తారు గాని, యీఆందోళనను పోషించడం మానలేరు. మానరు; యిందులోనూ యెంతప్రమాదం వుంది. ఆ యా యజమాని, ఎప్పుడైతే తనసేవకుడు తిరుగుబాటొనరించు ఉద్దేశములను గలిగియున్నాడని తెలిసికొన్నాడో, అప్పుడే యాతడు తనపనిని గోల్పోవును. కుటుంబం, భార్య, పిల్లలు మాడిపోదురు; ఆతని కేక్షయచ్ఛాయలు లేకపోలేదు. కాని యేవో కష్టాలు వస్తాయని మన కర్తవ్యాన్ని విస్మరించడమా? మరోటి, వాళ్లకి యిప్పుడున్న కష్టాలకంటె ముందు యెక్కువ వస్తాయని.

సామాన్య కార్మిక కర్షక సంఘములోనికి వెళ్లి చూస్తే నేడు, కానవచ్చే పరిస్థితి ఇదే.

ఈ అసమాన యుద్ధంలో, అంటే సుస్థాపితాలైన, సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మతశక్తులతో, పరికర శూన్యుడైన యీ కార్మికుడొనరించు పోరాటంలో, ఆతడెన్నిసార్లు యిట్లు వాపోయియుంటాడు!

'మన' జీవితాలను కూడ లెక్కపెట్టక, సాంఘిక వ్యయముపై చదువుకొన్న, ఆ యువకులిప్పుడెందున్నారు! వాళ్ళు చదువు కుంటూన్నన్నిరోజులూ వాళ్ళకి దుస్తులు, తిండి, మనము వాళ్ళకీయలేదా? మనము యెండవానలను లెక్కపెట్టక, కొండలు పిండి కొట్టు బరువుమోసి, కడుపులోకి గంజినీళ్లేనా పూర్తిగా తాగియెరుగక పోయినా, యీ పెద్దభవనాలు, కళాశాలలు, మ్యూజియములు, యిట్టివెన్ని నిర్మించి, యిస్తున్నాము. పుస్తకాలుచదువుట మనకు తెలియనే తెలియదు. కాని వారికొరకై యెట్టి చక్కని, పెద్దపుస్తకాలు అచ్చువేసి యిస్తూన్నాము. కండ్లు గుంటలు పట్టి, మొగాలు తెల్లబోయి, పాలిపోయినాకాని, మానవ సంఘముయొక్క విజ్ఞానాన్నంతా తమ బుర్రలో యిముడ్చుకొన్నామని పెద్దమాటలు చెప్పే ఆపెద్ద పండితులిప్పు డేమైనారు? వాళ్ళ కండ్లకు మనము పురుగుల్లా కూడా కన్పించకు కాబోలు! స్వాతంత్ర్యాన్ని గురించి వ్యాఖ్యానాలు చేస్తూ, గంభీరంగా పోషిస్తూండే ఆదేశభక్తులు, యిప్పుడేమై పోయారు? నిత్యమూ, ధూళిలోకి తొక్కి వేయబడుతూన్న మన స్వాతంత్ర్యమును గూర్చి, ఆస్వాతంత్ర్య పురుషులు ఎప్పుడైనా ఆలోచించిరా? ఈవార్తగాళ్ళు, యీకవులు, యీచిత్రకారులు వీళ్ళూ వాళ్ళూ అన్నమాటేమిటి? ప్రతీవారూ, దీనప్రజలని, కళ్ళనీళ్లతో యెన్నో ఉపన్యాసాలిస్తారు. యెన్నో కథలు వ్రాస్తారు. యెన్నో చిత్రాలు చిత్రిస్తారు. గాని వాళ్ళు, మన యీ పోరాటంలో, యేమూలనైనా కన్పించుతూన్నారా? మన సంఘములోనున్న చెడుగు తొలగించుటకై మనము ఒనరించుచున్న యీ పోరాటములో వాళ్లు, మనకెట్టి సానుభూతినైన చూపిస్తున్నారా?

కొందరు తమకెట్టి స్థితిలోనున్నా పిరికి వాళ్లైపోయి, ఉపేక్షాభావముతోనే, తిరుగబడే సమర్థత, మగతనంలేక అనుభవిస్తూంటారు. మరికొందరు మానుషత్వాన్ని, సిగ్గునూ కూడా విడిచిపెట్టి, సామాన్య ప్రజలు తమ సౌకర్యాలకేమో భరింపవస్తూందని చెప్పి, అట్టి విశాల ఉద్దేశ్యాలు గలవారి పోరాటాన్ని యెదిరించి, యెట్టి కుతంత్రాలవల్లనైనా. అణచివైచుటకే చూతురు.

అప్పుడప్పుడు, ఒక్కొక్క ఉద్రేక స్వభావము గలవాడో, కీర్తిప్రతిష్ఠలు కోరేవాడో. యువకుడు యీ పోరాటంలోకి వస్తూంటాడు. బహుశా ఆతడు, తన మనోవీధిలో, పెద్ద ఊరేగింపులు, అధ్యక్ష పీఠాలు, యుద్ధరంగంలో జయము కలిగినమీద గలిగే గౌరవం, వీటినే చిత్రించుకొంటూ, ఆశాపూరితుడై యుంటాడు. కాని, తన గమ్యస్థానానికి, త్రోవ చాల దీర్ఘమనీ, అది పువ్వులతో నింపినదిగాక, ముండ్లతోగూడిన త్రోవ యనీ తెలిసికొన్న తర్వాత, తమ అంతవరకూ యేసిద్ధాంతాలకై పోరాడేనో, వాటిని గంగలోముంచి, పరుగెత్తుతాడు. సాధారణంగా వీళ్లందరూ, యేదో ఆశతో, బావుకుందామని వచ్చిన ఆత్రగాళ్లు. ప్రథమవేగం చల్లారిన తర్వాత వాళ్లు సాధారణంగా పదవులకోసం వోట్లకోసం మాత్రమే, చూస్తూ, కూర్చుంటారు. వారు మొదట యేసిద్ధాంతాలను పొగడేరో, వాటినే ప్రజలు అమలులో పెట్టడానికి చేసేయుద్ధంలో, వాళ్లకు వ్యతిరేకంగా ఉండడానికి సిగ్గుపడరు. వాళ్లమీదనే తమ ఫిరంగులను, యెదురు తిప్పడానికి, వాళ్లేమీ సందేహించరు. వాళ్లమాట, వేదవాక్యమనీ, యిదివరదాకా వాళ్ల అధికారం క్రిందనున్న ప్రజలు, తమరిని మానే, అట్లున్నారనీ వాళ్ల ఉద్దేశ్యం, అంతేకాని, ఏఉన్నతా ధర్మాన్ని వాళ్లు అవలంబించిరో, దానివల్లనే, వారికి నాయకత్వం యిచ్చారని, అనుకోరు.

కొందరు, ఇల్లాంటి, నీచత్వానికీ, గర్వములో కూడిన అసహ్యతకీ పిరికితనంతో కూడిన అపవాదులకు, ద్రోహానికీ వెనుదీయక పోయినా,

మధ్యతరగతి యువకులు, చరిత్ర ప్రసిద్ధిగా ప్రతీ సాంఘిక విప్లవంలోను పాల్గొంటూన్నారని, విదితమే. ఈమధ్యతరగతి యువకులు, ప్రజలలో ఆత్మవిశ్వాసాన్ని విజృంభింప జేయడానికి, ముందంజవేసి, విప్లవాన్ని గమ్య స్థానానికి నడుపుతారు.

'నేనేమిచేయాలి' అని, ఇంతపని వుంటూంటే, నీవు అడిగినది బావుంది? ప్రజాసామాన్యము; కార్మికకర్షకులు; ప్రపంచానికి కావలసిన సమస్త వస్తువులనూ ఉత్పత్తిచేసే యీ శ్రామికవర్గం; శతాబ్దాలనుంచి అజ్ఞానములో ఉంచబడి, దోచుకొనబడిన యీ శ్రామికవర్గం బూర్జువా వర్గంతో చేస్తూన్న మహాయుద్ధంలో, యువకులను, వేలకొలది మందికి, తమ బుద్ధిని, యావనోత్సాహమును, శక్తిని, పూర్ణంగా వినియోగించ డానికి, అవసరంలేక పోయిందా! ఉంది, ఉంది, ముమ్మాటికీ ఉంది.

## మనం యేంచేయాలి! వినండి!

శాస్త్రీయ సిద్ధాంతాలను ప్రేమించే, ఓవిద్యార్థులారా! యువకు లారా! మీకుసరిగా సోషలిజము అంటే తెలియనట్లైతే, మన తలుపుతట్టు తూన్న గొప్పవిప్లవమును, మీరుసరిగా అర్థంచేసుకొననట్లైతే, శాస్త్రాల న్నిటినీ తిరిగి పరీక్షించి, నూతనసంఘ సిద్ధాంతాలతో, విరుద్ధంగాకుండా ఉండేటట్లుగా పనిచేయునట్లు చేయాలనీ, ఈరంగంలో, వెనక ఎప్పుడూ యెవరూ, కనివిని యెరుగనట్టి, సంపూర్ణమగు మార్పుతీసుకొని రావాలనీ, అట్లుచేయుట మీవిధియై యున్నదని, మీకువేరే చెప్పవలయునా?

ఇప్పుడున్న చారిత్రక గ్రంథాల్లో, చక్రవర్తుల గాథలు, గొప్ప రాజనీతి జ్ఞుల కూటనీతులు, రాజకీయసభలు, పార్లమెంటులు వీటికార్యక్రమాలు, పాలక జాతులు దేశాభిమానం పేరిట, స్వలాభంకోసం చేసే దారుణహింసలు, ఇవి మినహా మరేవి యుండవని, మీకు తెలియదూ? ఈచరిత్రలనుకూడ తిరిగి నూతనపద్ధతులమీద వ్రాయవలసియుంటుంది.

వాటిలో మానవసంఘంయొక్క క్రమవికాసం, ప్రభుత్వమూ, మతమూ వీటి యుద్దేశ్యములు, వాటికల్ల యేయేవర్గములకు లాభమున్నదీ, కార్మిక కర్షకవర్గము, సామాన్యప్రజలు, వీరిస్థితిగతులే యే ప్రభుత్వాలు, యేయే విధంగా నాశనంచేసినదీ, మొదలైనవిషయాలు, శాస్త్ర యుక్తంగా వ్రాయాలిసి యుంటుంది. అర్థశాస్త్రాలన్నికూడా, బూర్జువావర్గం, శ్రామికులను నిరంతరమూ దోపిడిచేసేపద్ధతులలో సులువుమార్గాలు, తప్పు ముక్కలు, పరస్పర విరుద్ధ సూత్రాలు, బోధిస్తూ, ఈ కాపిటలిస్టు దోపిడీ విధానమే, మనకు ముక్తిదాయకమని బోధిస్తూ, యీవిధానాన్ని త్రోసివే యుచో చాల ప్రమాదం తటస్థిస్తుందని ప్రచారంచేస్తున్నాయి. ఈఅర్థిక శాస్త్రాన్నికూడ, అంతర్జాతీయ దృష్ట్యా, ఆధునిక పారిశ్రామిక విప్లవ పరిణామా న్ననుసరించి, తిరిగి వ్రాయాలి. ఈవిధంగానే మానవ శాస్త్రము, సామాజిక శాస్త్రము, నీతిశాస్త్రము, మొదలగు వాటిలో సంపూర్ణమగు మార్పులుచేయవలెను. ప్రకృతిశాస్త్రముయొక్క వివిధ శాఖలలో కూడా ఆధునిక పద్ధతులపై మార్పుచేయవలసిన వెన్నో గలవు. సరే. చాలును "మాటలుచెప్పికార్యములేదు. మీపనినింక ఆరంభించండి. మీశక్తినంతను, యొకమహాత్కార్యము నిర్వహించుటలో వినియోగించుడు. శాస్త్రవిజ్ఞానం వల్ల, మీఅంధ విశ్వాసాలని పారద్రోలండి; మానవత్వమనే సామాన్యధర్మం పేర మనలోని యైక్యతను పెంపొందించండి. ఇంతేగాక, మనలను నిరంతరమూ యెదుర్కొంటూన్న కఠిన సమస్యలను విడగొట్టే పద్ధతుల నేర్చుకోండి. వైజ్ఞానిక శాస్త్ర పరిచయంవల్లగూడ, మీలో నిట్టిశక్తులు విజృంభింపచేయక పోతే తప్పెవ్వరిది? వెనుకటి శతాబ్దములందలి తత్వశాస్త్రవేత్తలు యెట్టి త్యాగముల నొనరించియున్నారో, అట్టి విధముననే, మీరుగూడ, సత్యాన్వేషణకై, మానవసంఘ క్షేమమునకై, మానవుడనంత త్యాగమూ నొనర్చి, పోరాడునని, ఉదాహరణ పూర్వకముగా, చూపాలిసి యుంటుంది

ఓ వైద్యుడా! నీ చిరకాలానుభవంచేత, సామ్యవాదమందలి నిజాన్ని గ్రహింపగల్గుచో, నీకర్తవ్యమేమిటో తెలుసునా? ప్రస్తుత సంఘ

ములోని మూఢాచారములు, కూలీవ్యవస్థ (Labour condition), యి ప్పుడున్నట్లే యుండుచో, మానవజాతికి ఘోరపతనము తప్పదని, ప్రజ లందరికీ, నిత్యమూ చెప్పవలసి యుంటుంది. ఇప్పటి యనారోగ్యకర పరిస్థితులలో, లేమిలో, జనులు పుట్టుట, పెరుగుట జరుగుతూన్నంత కాల మూ, యెన్ని కొత్త మందులు కనిపెట్టినా, యెందరుధన్వంతరులు దిగివచ్చి నా, రోగాల్నియేమాత్రం తగ్గించలేరని, ప్రజలకునచ్చచెప్పాలి. రోగా లన్నిటికీ, ఆర్థిక, అవ్యవస్థ, భౌతిక అసమానత్వమూ, యీరెండే కారణా లని, వారికి నిరూపించి చెప్పవలసియుంటుంది. ఈ భేదాలని, నిర్మూ లించితేగాని,యీ రోగాలేమాత్రం తగ్గవని చెపుతూ, దాంతోపాటుగా, వాటిని నిర్మూలించే మార్గంకూడా చెప్తూండాలి.

ప్రతీక్షణమూ కుళ్ళిపోతూన్న యీ సంఘములో తీసివేయవలసిన భాగాలని శస్త్ర చికిత్సచేసి తీసివేయాలిసి వుంది. మానవులు విశాల భావములతో, తమ జీవితాన్ని నడుపుకోవలసిన పద్ధతిని, అందుకుగల అవ కాశాలని ప్రతీవానికి చెప్పు. నిర్జీవమైన శరీరాంగాన్ని ఛేదించకపోతే, మిగిలిన భాగాన్నంతటినీ నశింపచేస్తుందని, వాళ్ళకి బోధపరచు.

ఓయువకుడా ! నీవు యంత్రవిద్యని ఆధునిక శిల్పకళలను అభ్యసిం చియుంటే, నువ్వు, నీ పరిశ్రమకీ, పరిశోధనలకీ ఫలితం నిరూపించాలి. కర్తవ్యనిర్ధరణ చేసికోలేకయున్న వారికి, యింతవరకు మానవుడెంత విజ్ఞా నమార్జించినదీ, ఆజ్ఞాన సహాయముచే యెట్టి సుఖజీవనము గడుపవచ్చు నదీ, చెప్పి, వారిని కర్తవ్య పరాయణులుగాచేయి. ఈ యంత్ర సాధ నములు, సంఘస్వాధీనములోనికి తేబడి, సరియగు వ్యవస్థలో నడుపబడు చో, అద్భుతఫలితములు గల్గుతవనినీ, మానవసంఘావసరములను దృష్టిలో బెట్టుకొని, వస్తువులనుత్పత్తి చేస్తే, అనేకరెట్లుగా ఉత్పత్తి నధికము చేసి, ప్రజలందరి యవసరములనూ తీర్చ వచ్చుననియూ, వారికి నచ్చ చెప్పవలె.

ఓ యువకుడా! నీవు కవివి, చిత్రకారుడవు, శిల్పివియగుదో, నీ కర్తవ్యమేమిటో గుర్తించినావా? నువ్వు ఆరాధిస్తూన్న కళయొక్క సంపూర్ణాభివృద్ధిని కోరుచున్నవాడవైన, యిట్లురా. నీ కలాన్ని, కుంచెను, ఉలిని, సాంఘిక విప్లవానికి మార్గంచేయడంలో ఉపయోగించు. ఉత్సాహపూర్ణమైనరచన, భావపూర్ణమైన చిత్రము, వీటిచే, అత్యాచారులకు విరుద్ధంగా కార్మిక కర్షక వర్గము చేస్తున్న యుద్ధానికి, దోహదము చేయించు. యువక హృదయాలలో, విప్లవాగ్నిని దరికొల్పు మానవసంఘం యొక్క ఔన్నత్యమునకై, యెవడు తనజీవితాన్నర్పిస్తున్నాడో, వానిభార్యయే ధన్యురాలని, నొక్కి చెప్పు. శ్రామిక వర్గమునకు, వారి ప్రస్తుతావస్థ యెంత దీనంగా ఉందో, అట్టి స్థితికి కారణాలేమిటో స్పష్టంగా తెలుపుము. సంఘములోని మూఢాచారములు, విపరీత సిద్ధాంతాలు, మనకు కళంకములనీ, వాటిని మన మార్గంలో నుంచి తొలగించినట్లయిన, మన జీవితం యింతకంటె అనేక రెట్లు వాంఛనీయంగా ఉంటుందనీ చెప్పాలిసుమా!

ఒక్కటే ఆఖరుమాట చెపుతున్నా. ఎవళ్ల దగ్గర జ్ఞానం, వక్తృత్వం, యోగ్యత, కష్టపడిపనిచేయగల శక్తి, ఉన్నదో, అట్టి వారంతా లేచి రాండి. మీమనస్సులో కార్మిక కర్షకవర్గం యొక్క కష్టాలకు కొంచమైనా సానుభూతి ఉంటే, రాండి. మీ స్నేహితులను కూడ యీ మనన్యాయపక్షానికి తీసికొనిరాండి. మానవసంఘానికి, యెవరు తమజీవితాలనర్పించి, సుఖసామాగ్రిని సమకూరుస్తున్నారో, వారి పక్షాన్నవలంబించి మీకర్తవ్యమును నెరవేర్చుకోండి. కాని, మీరంతా ఒక్క విషయాన్ని జ్ఞప్తి యుంచుకోండి. ఒక మహా నాయకుని వలె గాక, స్నేహితుని వలెనే, రంగంలోకి దుముకండి. నువ్విక్కడ అధికారం చలాయించడానికి రాకూడదు. ఒక నూతన జీవితంలో అడుగుపెట్టి, నీశక్తిని, సంఘక్షేమానికై వినియోగించేటందుకు, వస్తున్నావనుకో. ప్రజలకుపదేశించడంతోటే, నీ పని పూర్తయిందనుకోకు. ప్రజలకోరికలకు సరియైన రూపం

యిచ్చి, వాటిని నెరవేర్చుకొనేందుకు తీవ్రయత్నం, వారితో బాటుగా నీవు గూడా, చేస్తూండాలి. ఏవిధమైన విశ్రాంతినీ కోరకుండా, నీలోని, యావనోత్సాహాన్ని, జీవితానుభవాన్ని సమ్మిళితంజేసి, కర్తవ్య పథ గామివి గమ్ము. ఇట్లా చేసిననే, నీవు, సార్థకమగు జీవితాన్ని, గడపిన వాడవగుదువు. అప్పుడే, నీవీ విషయంలో చేస్తూన్న ప్రయత్నాలన్నీ, వ్యర్థమై పోవడం లేదని తెలుసుకో గలుగుతావు. ఎప్పుడైతే ఒక్కసారి, నీ ఆలోచనలకు, నీ కార్యాలకు, యిట్టి యున్నత భావ మూలకమగు ప్రేరణ గలుగుతుందో, అప్పుడే నీలో అంతర్హితములైయుండి, ఎన్నడూ నీ వనుకోనవైనా యుండని, ఉత్తమ కార్యశక్తులు, నీకు గల్గుతవి.

నీవీ విధంగా సామాన్య ప్రజలతో కలసి యుండి, న్యాయ, సమానత్వములకై యెడ తెగని పోరాటం చేస్తూంటే, అంత వరకూ దూర దూరంగా చెదరిపోయిన,కర్షక కార్మిక శక్తులన్నీ, నీ యందే కేంద్రీకరింప బడతాయి. ఇంతకంటే మనం కోరేదేమున్నది ?

ఇప్పుడైనా, నేను, ధనవంతులకీ, ఉన్నతపదవీ వాదులకీ, రెండు మాటలు చెప్పక పోతే, బాగుండదు. ఆ శ్రేణులకు జెందిన, ఓ మానవులారా ! మీ జీవితాలలోని అశాంతిని, ద్వైవిధ్యాన్ని పోగొట్టు కోవాలీ అంటే, సామ్యవాదుల దగ్గరకు చేరండి. వాళ్లతో గలసి పనిచేయండి. సాంఘిక విప్లవం సఫలం చేసే ప్రయత్నాలలో, మీరుకూడా తోడ్పడి, యింతవరకు కర్షక కార్మిక వర్గాలకి, ఉన్నత వర్గాలకు జెందిన మీ పూర్వులు చేసిన ద్రోహాలకు ప్రాయశ్చిత్తం చేసి కోండి. మీలో యేమాత్రం విశాల భావం, శాస్త్రీయతర్కం చేయగల శక్తీ ఉన్నా, మీకు సామ్యవాదం అంటే, స్వాభావిక పరిణామంగా తోచక మానదు. గాని ధనస్వామ్య వాదులకీ, సామ్రాజ్యవాదులకీ, ఈ మహోన్నతాదర్శము, అసంబద్ధంగాను, దౌర్జన్య యుతంగానూ కాన్పించుటలో వింత లేదు. యుగయుగాల నుండి, కోట్ల కొలదిగా నున్న సామాన్య ప్రజలను,

యీ ఉన్నత వర్గాల వారు చేయుచున్న పీడనము, దోపిడీ, నలిపి చంపుట, దౌర్జన్యాలు కావనియే, వారివాదన కాబోలు !

ఓ బీద సోదరులారా! ఈ వర్గాలకి చెందిన యువకులతో, రెండు ముక్కలు చెప్పితీరాలి. ఈరోజులలో వీరికి, అట్టే పెంచిచెప్పాలిసిన, అవసరం అంతగాలేదు. యేమంటే, మీరెంత విద్యావిహీనులైనా, బలశూన్యులుగానున్నా, దారిద్ర్యము, నిరుద్యోగము, సాంఘికపీడనము, కాపిటలిస్టు దోపిడి, మొదలగువాటింలోబడి, నిత్యమూ మాడిపోతూన్న మీరు. సామ్యవాదులు గాకుండా, యెట్లుండగలరు.

బీదవారిలో పుట్టికూడా, ఎవ్వడు సామ్యవాద విప్లవానికి సాయం చేయడో, వాడు, తన సౌఖ్యంకూడా యెందులో ఉందో యెరుగని మందుడనీ, మూర్ఖుడనీ, వానికర్తవ్యం తెలిసికో లేడనీ చెప్పకతప్పదు.

అబ్బా, అదినుంచి శీతాకాలము. మీరప్పటికింకా వీధుల్లో ఆడుకొనే చిన్నవాళ్ళుగానే ఉండేవారు. జ్ఞాపకంలేదూ? మీరుముంగిట, చిరుగుల గుడ్డలతో ఆడుకొనేవారు. చింకిరిగుడ్డల్లోంచి చలీ, దుమ్మూ, మీశరీరాన్ని, యెప్పుడూ పీడిస్తూండేవి. ఆసమయాల్లోబాగా బలిసిన కొంతమంది పిల్లలు, మంచిదుస్తులు ధరించి, వీధేపోతూ; మిమ్మలిని హేళనచేయడం జ్ఞాపకంలేదా? ఆఅవస్థలోకూడా, వాళ్ళలో యెవ్వడూకూడా తెలివి తేటల్లోగాని, పనిచేసే శక్తిలోగాని మిమ్మలిని మించలేడని, మీరు బాగా తెలుసును. కాని మీరుబీదలు, తక్కువ వాళ్లూగాదామరి! వాళ్లకున్న అవకాశాలు మీకేవి? తర్వాత కొద్దికాలానికే, మీపొట్టకూటికై ఫాక్టరీలలోచేరి ఉదయంమొదలు అస్తమానంవరకూ, యంత్రాలలో, బానిసల్లాగ పనిచేస్తూ, మీజీవితాలని భారంగా యీడ్చుకువస్తూన్నారు. యీ లోపుగా ఆలాంటి పిల్లలు, స్కూళ్లు కాలేజీలు మొదలైనవాట్లలో దండయాత్రలు కొడుతూ పోయిపోయి, మీనెత్తియెక్కి కూచుంటారు.

వాళ్లు, మీయజమానులుట! అందుచే, పొందదగిన జీవిత సౌఖ్యములన్నిటినీ మీనుండిపిండివేసి, వాళ్లే అనుభవిస్తూంటారు. కాని మీఅవస్థ యెట్లావుంటుంది. ప్రతిరోజూ మీరుపనినుంచి యింటికి, కాళ్లీడ్చుకుంటూపోతారు. చీకటిగా, చెమ్మగాఉన్న యింట్లోచేరి, ఆకాస్త జాగాలోనే, మీకుటుంబం, అయిదారుగురూ, పడుంటారు. నడివయసులోనే వృద్ధాప్యమును పొందిన ఆస్త్రీ, మీతల్లికాబోలు, పాపమామె, యిన్ని గంజినీళ్లూ, నాలుగుమెతుకులూ, నీదగ్గర పెడుతుంది. ఆగంజినీళ్లేనా పరిశాంతంగా తాగుతావా అంటే, అదీలేదు. నూకలుకొనుక్కొన్న అదుకాణదారుడికి, రేపుడబ్బివ్వడం యెట్లాగా, అనే ఆలోచన, నిన్ను పీడిస్తూనే ఉంటుంది; అద్దెవాడువచ్చి అడిగితే యేంచెప్పను, అని యోచిస్తూనే ఉంటావు, ఈపరిస్థితుల్లో, పాపం, ఆగంజినీళ్లేనా, ఒంటబట్టవు, నీకు.

నీపూర్వులంతా గడపిన దుఃఖపూరిత జీవితాన్నే, నీవూగడపుటకు కోరుతూన్నావా? కొద్దిమందియొక్క సుఖానికై, కోట్లకొలది మానవులు బలిచేయ బడుతూంటే, నీవూ, సహించి ఊరుకుంటావా? బ్రతికిఉన్నంతకాలమూ, ఏరోజుకారోజు, రేపటి తిండిమాటేమిటిరా? అనే ఆలోచించే స్థితిలోనే కాలంగడపదలచి యున్నావా? సోమరిపోతులకు సుఖంగలుగ జేయడానికి, వాళ్లకి సమస్త భౌతిక సంపత్తులను సమకూర్చుటకు, నీజీవితానందము కలుగజేయు వస్తువులన్నిటికీ దూరమై పోదలచుకొన్నావా? నిరంతర పరిశ్రమవలన క్రమంగా క్షీణశక్తుడవై, కష్టాలు వచ్చినప్పుడు కన్నీరుగార్చి ఊరకుండుటకే, నిశ్చయించుకొంటావా? నీలో కొంచమయిన పౌరుషమునకు తావులేదా? లెమ్ము, సోదరా, నీకిప్పటికంటె ముందు యెక్కువకష్టాలు వస్తాయా?

నీవిప్పుడున్న యవస్థలోంచి బయట పడేందుకు, మార్గం కనపడినప్పుడు, 'నాబోటివాళ్లు, లక్షలున్నారు. లోకం అంతా యిట్టి దురవస్థలోనేవుంది యీపరిస్థితులలో మార్పు సాధ్యమౌతుంది? తిరగబడితే, ఈగం

జికి కూడా మొగం వాచాలేమో: ఏకోకాస్త వున్నవాళ్లిలా తిరిగినా, బాగుంటుంది, కాని మాబోటి వాళ్లు, చాకిరీ చేసుకుంటూ, చచ్చినట్టుపడి యుండడమే మంచిది. అనుకుంటావు. యేలాఅనుకున్నా, మీజీవితమందలి కష్టాలే, నిన్ను మేలుకొల్పుతాయి,

ఈ కాపిటలిస్టు లాభముల పద్ధతిలోనున్న పరస్పర విరుద్ధ శక్తులవల్ల, సాధారణంగా వ్యాపార మాంద్యము (Crisis) వస్తూవుంటుంది. మిల్లులు మూసివేయ బడతాయి. వ్యాపారం మందగిస్తుంది. ధరలు పడిపోతాయి. ఉద్యోగాలు పోతాయి. వేలకొలది జనులు నిరుద్యోగులై, మల మల మాడిపోతారు. పంటలు యధాప్రకారంగానే పండుచేవిగాని సామాన్యప్రజలకు గంజికూడ కరువగును. మిల్లులు అందరకీ సరిపడ్డబట్టలనుత్పత్తి చేయగలవుగాని, లాభములను పెంచుటకై, ఉత్పత్తి నియమితము చేయబడును. బట్టలుకూడ లేక జనులు శీతవాతాతప బాధలకి గడ గడ లాడుచునే యుందురు. కుటుంబాలకి కుటుంబాలే, మలమలమాడి, రోగాలచే పీడింపబడి, చస్తూంటారు. ఏటా వైద్యకళాశాలలలో తరిఫీవయి వేలకొలది వైద్యశిఖామణులు వస్తూంటారు. గాని రోగాలకి ప్రజలు లక్షలాదిగా బలియౌతూనే ఉంటారు. వీటికన్నిటికీ కారణ మేమిటి ? సామాన్య కర్షక కార్మికవర్గము, యీవిధంగా పీడింపబడుతూన్న యీస్థితిలో జమీందారులు, భూస్వాములు, మఠాధిపులు, వర్తకులు, ప్రభుత్వోద్యోగులు మొదలగువారుమాత్రం యధాప్రకారంగా సుఖభోగాలతో, యౌవనవిలాసాలతో, సుందర భవనాల్లో, కాలుకిందపెట్టనవసరం లేకుండానే, కాలం వెళ్లబుచ్చుతూంటారు. శిస్తులు తగ్గవు; పన్నులు తగ్గవు; అద్దెలు తగ్గవు; వడ్డీరేట్లు, లాభాలు తగ్గవు. ధనికులు యింకా ధనికులౌతూంటారు. బీదలు యింకా బీదవారగుతూంటారు. యిట్టి అవస్థలో నీకీ సంఘ విధానములోని లోట్లు కళ్ళకుకట్టినట్లు పడతాయి. నీచత్వముతో కూడిన సోమరి పోతు స్వార్థమునకై, నిరంతరమూ కష్టించి

సౌజన్య హృదయాలు, లక్షలుకొలదిగా బలిచేయబడుతూన్న, యీ సం ఘాన్ని నిర్మూలించి, నూతన సంఘ నిర్మాణం చేయాల్సిన యావశ్యకత నీకు గోచరిస్తుంది. అప్పుడే నీకు, సామ్యవాదులు చెప్పు విషయాలర్థము కావడం ప్రారంభించుతాయి.

సర్వజనీనమైన యీ వ్యాపార సంకటంమాట అట్లుంచి, మీ స్వవి షయాన్ని గురించే మాట్లాడు కుందాము. తన వ్యాపారంలో లాభాలధి కం చేసుకోడానికి, నీయజమాని, కూలీలకి జీతం తగ్గించ దలచవచ్చు; లేదా రోజూ యే రెండుగంటలో యెక్కువకాలం పని చేయుమనవచ్చు; మీరా యన్యాయాన్ని నిరోధించబోతే, యాతడు మండిపడి 'లేచి పోండి, వెళ్లి గడ్డితింటారో, యేంజేస్తారో చూస్తాను. ఈ కూలీపనైనా యెవ్వడిస్తాడో, మీకు' అంటాడు, అప్పుడు మీకే తెలుస్తుంది, మీయజ మాని మిమ్మల్ని గొర్రెను గొరిగినట్లుగా గొరగడమే కాకుండా, నిన్నింకా నీచంగా చూడదలచేడని. ఈ కాపిటలిస్టు వస్తూత్పత్తి పద్ధతి, ఆర్థిక అస మానత్వమూ, మిమ్మలిని శాశ్వితంగా బానిసలుగా చేసివేస్తూన్నాయనీ, వాటిని నిర్మూలించ నంతవరకూ, మీస్థితేమీ బాగుపడదనీ గ్రహించగ లరు, నీవు, ఆసమయాల్లో వాళ్లకి లొంగిపోయావా, నీలోని మనుష్యత్వం పోయిందన్నమాటే. నీరక్తమాంసాలన్నీ పిండేసిన తర్వాత నిన్ను చూడం గాతోసివేస్తాడు, అట్లాంటి అవకాశం వాళ్ల కెందుకివ్వాలి? నీరక్తంలో వేడి అంటూఉంటే ధైర్యంగా, వాళ్ల దురంతాల నెదిరిస్తావు. వాళ్లు నిన్ను పనిలోనుండి తొలగిస్తారు. అప్పుడునీవు బ్రతుకుజీవుడా అని, సామ్యవాదుల దరిజేరి, ఆర్థిక, సాంఘిక, రాజకీయ బానిసత్వాల నన్నిటినీ రూపుమాపి, నూతనసంఘాన్ని స్థాపించు కోపడంలో తోడ్పడు తూం టావు.

ఓ యువతులారా! ఈ సంఘములో మీరెక్కడ నున్నారు. బానిసలకంటె అధమాధమ స్థితిలోగాదా! ఆర్థిక బానిసత్వంమీ ముఖ్యాల

క్షణము; నిరక్షరతమీ ముఖ్యయోగ్యత, పల్లెటూళ్లలో తిండికూడ జరక్క-
యే కూలి దొరుకుతుందనో, యే ఫ్యాక్టరీలో చేరుదమనో, పట్టణాలకి చేరు
కొంటూన్న బీదవాళ్లు, కర్షక స్త్రీలు యెంతమంది ఉన్నారు? మీకూ తె
లుసును, పట్టణంలో జీవించడం కష్టతరము. కాని ఆమెకు గత్యంతరమేదీ?
పాపమా సోదరీమణుల యవస్థ యేమౌతుందో తెలియదూ? ఎవడో కాస్త
నాలుగువేళ్లూ నోట్లోకి పోయే అవకాశాలున్న పెద్దమనిషి వాళ్ల బీదత
నాన్ని అవకాశంగా తీసుకొని, తియ్యని మాటలుచెప్పి ఆమెను చేజిక్కిం
చుకుంటాడు. ఆమెను తన కవసరం గలిగినంతవరకూ ఉపయోగించుకొని
పాలల్లోపడ్డ యీగనుపారేసినట్లు మూలంగా తోసేస్తాడు. ఆయవస్థలో
ఆమె నెత్తిన ఓబిడ్డ భారంకూడా పడుతుంది. దాంతోటే ఆమెపతనం
ప్రారంభం. దుఃఖకరమైన జీవితంగడపి, కొద్దికాలంలోనే తన యౌవనా
న్నిగోల్పోయి, యే గోడ్డు పక్కనో తనజీవితాన్ని ముగించుతుంది.
యిట్టి కథలెన్నిటిని! దినదినమూ వింటూన్నాము.

భౌతిక వాంఛలను పొందుటకై యే గదా మానవులిట్టి దురంతరము
లను పొందుచున్నారు. కాని ఆ భౌతిక బానిసత్వాన్ని నిర్మూలించడా
నికి మీరెట్టి ప్రయత్నాలు చేస్తూన్నారు. ఓ సోదరీమణులారా! కర్షక
కార్మికవర్గములకు జెందిన యువతులారా! మీ చిన్నిబిడ్డల నోటిలోనుంచు
కొని పాలిస్తూన్నపుడు, భవిష్యత్తులో, ఆబిడ్డడెంత బాధపడవలసి యుం
టుందో, యీ సంఘ నిబంధనలు, వాళ్ల నెంతపీడించునవో, యోచించడం
లేదూ? మీ మీ తండ్రులెట్టి బాధ లనుభవించారో, మీ భర్తలెట్టి
బాధ లనుభవిస్తూన్నారో, మీ జీవితములెట్టి తుచ్ఛములుగా నుంటూ
న్నాయో తెలియడంలేదూ? మీ చెల్లెళ్లు, తమ్ములు, కూతులు, కొడుకులు
భవిష్యత్తులో, కట్టగుడ్డలేక, ఉండనిల్లులేక, తినతిండిలేక, నిరంతర కష్ట
ములతో చిక్కిపోయి, యెన్ని బాధలు పడాలో తెలియడం లేదూ?
మీ వెనుకటి వారంతా యెట్లు, కృశించి రాలిపోయారో, అట్లే మీసంతా

నంకూడా నశించిపోవాలని, మీ కోరికా? వాళ్లుకూడా, రేపటి మాలేమిటిగా? అనే ఆలోచనలోనే ఉండాలని, మీ కోరికా? కాస్త కాలక్షేపం చేయ్యాలంటే కల్లుదుకాణంతప్ప, వాళ్లకేమీ యుండకూడదని, మీ యాశయమా? సామ్రాజ్య వాదపరిభుత్వం యొక్క దుర్నయాలకు, వాళ్ల ఆశలకు, మీరంతా బలియౌతూండడమే మీ వాంఛయా? మీరెక్కలకష్టాలవల్ల ఉత్పత్తి చేయబడిన వస్తువులవల్ల లాభాలు గడించి సుఖం, ఆనందం అనుభవిస్తూన్న, ఆసామిపోతుల దయాధర్మ భిక్షాలపై, మీభర్తలు, పుత్రులు, మీకుటుంబాలు, ఆధారపడి యుండవలసినదేనా? మీలో నిహానుమానాన్ని, రాజకీయాధికారంచేత, మతంపేరిట మూఢ విశ్వాసాల చేత, మిమ్మల్ని అజ్ఞానంలో ఉంచడంచేత, హరించి, మిమ్మల్ని పీడిస్తూన్న యీ, దోపిడివిధానాన్ని, కాదనడానికి, మీలోని శక్తినంతనూ కేంద్రీకరించుకోండి;

మీ భర్తలు; పౌరుషహీనులై, కర్తవ్యతా మూఢులై, యీబానిసత్వాన్నే తలలొగ్గి భరిస్తూన్నపుడు, మీరక్తం ఉడుకెత్తడం లేదా? కర్తవ్యపథాన్ననుసరించిన, వెనుకటి వీరమాతలే, మీకు ఆదర్శము! ఎందుచునన్నే యిక్కడే, నరకబాధలన్నీ అనుభవింప జేస్తూన్న యీ సంఘవిధానాన్ని నాశన మొనరించుటకై లేచిరండు!

## మనకర్తవ్య మేమిటి?

ఓ యువకులారా! స్త్రీపురుషులారా! కర్షకులారా! కార్మికులారా! సిపాయిలారా! కూలీలారా! మీహక్కుల్ని గుర్తించండి. మీ స్నేహితులతో కలసి, ఆ సాంఘిక విప్లవం కొరకై, మూఢ విశ్వాసాలిని నాశన మొనర్చి, నూతనమూ, విశాలమూ నైన జీవన మార్గాన్ని చూపించే విప్లవం కొరకై, ప్రయత్నించండి. మానవులలో, నిజమగు స్వాతంత్ర్యమును, సమానత్వమును, సోదరభావమును, పెంపొందింపచేసే,

ఆ మహోన్నతాదర్శ పూర్వకమగు విప్లవానికై ఎదురుచూడండి. మీ మీ శ్రమకి తగిన ఫలం అప్పుడే కలుగుతుంది; మీ యందు విశాల భావం మానవత్వం అప్పుడే కల్గుతాయి; మీ భౌతిక వాంఛలు అప్పుడే తీర్చబడతాయి. అట్టి నిర్మాణకర విప్లవాన్ని, (Creative revolution) సృష్టించండి!

మాకేమీ సాధనాలు లేవు. ఐకమత్యంలేదు. జనస్తోమములేదు, అంటారేమో. మీ నిర్మాణశక్తియే, రెక్కల కష్టమే మీ ఆయుధము! మీ వాంఛలే మీలో ఐకమత్యము కలిగిస్తాయి! ఇంక సంఖ్య చెప్పాలా!

ఈ అత్యాచారాల్ని సహిస్తూన్న జనసంఖ్య యెంతవుందో లెక్క పెట్టండి. సంవత్సరం పొడుగునా రెక్కలు ముక్కలు చేసికొని, అన్ని పంటలూ పండించి, భూస్వాములు, జమీందార్లు, ప్రభుత్వము, షావుకార్లు, వాళ్ల కిచ్చివేసి, పస్తుపడి యుంటూన్న, వ్యవసాయి కులం మనం కోట్లకొలదిగా యున్నాము.

నూలు, పట్టుతో, రోజుకు పదిగంటలు రెక్కలు విరగమోకొని, రకరకాల బట్టలు నేసి యిచ్చి, కుటుంబమంతా చింకిరి గుడ్డలు కట్టుకొని, చలికి, గాలికి బలియౌతూన్న, దిక్కుమాలిన, మనమెందర మున్నాము? గనులలో పనిచేసి, ప్రాణాలని కూడా అర్పించినా, మన కుటుంబాలు మాత్రం గంజికి గతిలేకుండా నేఉన్నాయి; కాని కంపెనీ వాటాదార్లు యేటా క్రొత్తక్రొత్త, మోటార్లు కొంటూనే ఉన్నారు. సాయంత్రం మిల్లు గంట కొట్టడంతోటే యిండ్లకు పోయీ పారిశ్రామిక కూలీలను, పెద్ద పట్టణాల్లో వీధు లన్నిటిని, నింపుకొంటూ పోతూన్న వాళ్లని, మనల్ని యెరుగమా?

చక్కని భవనాల్లో, పంకాలకింద కూర్చుని, మిలమిలలాడే దుస్తులతో, బాగా బలిసి, యెండకన్నెరక్కపోవడం చేత యెర్రనైన దేహా

లతో, ఒక్క కలంపోటుతో, మనల్ని లక్షల కొలదిగా, దారుణ యుద్ధాల్లోకి పంపే సంగతి తెలియదూ? ఆ యుద్ధాల్లో మనం యెవరి ప్రాణాలు తీస్తూన్నాము? ఎవరికై మన ప్రాణాల నిస్తున్నాము? ఆలోచించండి. ఒక్కసారి కన్నులు తెరవండి. మీ బలంతో, మిమ్మలినే నాశనం చేయిస్తూన్న యీసామ్రాజ్య కాంక్షుల, బలం మీకు తెలిసిపోతుంది. మీరు సగర్వంగా నిలబడ్డారా, వాళ్లు తెల్లబోయి, నాలిక్కరుక్కోవలసిందే. అట్టి మీరు లక్షలున్నారు.

నిత్యం, యితరులచే అవమానింపబడి తిరస్కరింపబడే మనసంఖ్యకు హద్దేమిటి? మనసంఘం మేంగ్కొండా, ఉప్పెనలా, అన్నిటినీ మ్రింగి వేస్తుంది.

మనమెప్పుడు ఆత్మవిశ్వాసంతో, స్వాతంత్ర్య స్థాపనకై, ముందున నురుకుతామో; అప్పుడే యీ పరాన్న భుక్కులు, పరార్థజీవులు తొలగింపబడతారు. సోదరా! నీకింకను సందేహమా!

(అరాజ్యవాది (Anarcho Communist) ఫ్రెంచి దేశస్థుడును, అగు ప్రిన్సు క్రోపాట్కిన్ యొక్క (Appeal to the youth) అనుదాని కనువాదము.)

వేమన పంచాయతీ
గ్రంథాలయం,
తెల్ప్రోలు :: కృష్ణా జిల్లా.

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల, జగన్నాథపురం, కాకినాడ.

# విశ్వసాహిత్యమాల,
# ముంగండ.

Via. అంబాజీపేట, తూ. గో. జిల్లా.

నియమములు :—

౧. ప్రతిమనిషికీ, జాతికీ, దేశానికీ, విజ్ఞానం, సంస్కారం కలిగించే పుస్తకములే, యేరి కూరుస్తాము.

౨. వివిధదేశాల, ఆర్థిక, రాజకీయ, చరిత్రలు, మహాపురుషుల జీవిత చరిత్రలు, వివిధరాజ్యాంగ తత్త్వాలను గురించిన గ్రంథాలు తేట తెలుగులో ప్రకటించుతాము.

3. ప్రతి 3 నెలలకూ ఒక్కొక్క పుస్తకం వెలువడుతుంది. జూన్ మొదలు జూన్ వరకూ ఒక్క సంవత్సరముగా పరిగణింపబడును.

౪. చందాదారులుగా చేరుటకు ప్రవేశరుసుము లేదు.

౫. సంవత్సరచందా రు. ౧-౪-౦ లున్నూ ముందుగానే చెల్లించి వేయాలి. వి. పి. లు చేయజాలము. సంవత్సరములో వెలువడు ౪ పుస్తకములును, పోస్టేజీ మేమే భరించి, చందాదారులకు, అందించుతాము.

౬. అప్పుడప్పుడు ప్రకటింపబడు అనుబంధ గ్రంథములు, చందాదార్లకు తక్కువవెలల కీయబడును.

ఆంధ్రభాషలో యిట్టిగ్రంథములులేని కొరతను దీర్చుటకై, కేవల సాహిత్యక, రాజకీయ, విజ్ఞాన ప్రచారమునకై ప్రకటింపబడుచున్న యీ గ్రంథాలను, ఆంధ్రులందరు కొని, చదివి, ప్రోత్సహింపగోరుచున్నాము. ఇట్టి వాటిని ప్రోత్సహించుట, జాతీయాభివృద్ధిని గోరు ప్రతి వారికిని, కర్తవ్యమూ, విధీ, యని వేరే చెప్పవలెనా?

ఆలస్యము చేయక వెంటనే చందాదారులు కండు.

# లియో - టాల్‌స్టాయి.



కౌంటు లియో నికోలేవ్ టాల్‌స్టాయి.

మానవ హృదయ మరసిన మహాత్ముడు. ప్రపంచరహస్యము ఛేదించిన దార్శనికుడు. కళామర్మము నెరిగిన కవి. అతని ఆదర్శం, తత్త్వజిజ్ఞాస, ఒక జాతికీ, మతానికీ చెందినవిగావు. సర్వమానవప్రపంచానికీ నూతన చైతన్య మొసగిన, ఆదర్శపురుషుడు. ఇంతయేల ఆదర్శములలోనూ, సిద్ధాంతములలోను కూడ వ్యతిరేకుడగు లెనిన్ వంటి వానిచే గూడ, "టాల్‌స్టాయి ప్రతిరచనయు, రష్యన్ కుటుంబ జీవనమునకు, భావములకు, విప్లవమునకునుగూడ, ప్రతిబింబమే," యని పొగడ్తనందిన యీతని జీవిత మవశ్య పఠనీయము.

# హిందూదేశము : క్రైస్తవ ప్రభుత్వ నిర్మాణతత్త్వము.



౨౦౦ పుటలు. వెల ౮ అణాలు.

ఈ ఆవృత్తి వెల ౧౨ అణాలు.

శ్రీ. శే. మేజరు బి. డి. బాసు, ఐ. ఎమ్. ఎస్.

సుప్రసిద్ధ చరిత్రకారుడు, గ్రంథకర్త.

జగమెరిగిన 'బాసు' మహాశయునిచే ఆంగ్లమున వ్రాయబడిన, Consolidation of the Christian Power in India యను గ్రంథమునకు, స్వేచ్ఛానువాదము. హిందూదేశములో బ్రిటీషు సామ్రాజ్యము యే రాజనీతిసూత్రములపై నాధారపడి యున్నదో, యెట్లు సుస్థిర మొనరింపబడినదో, తెలిసికొనగోరు, ప్రతి ఆంధ్రుడును చదివితీరవలసిన పుస్తకము.

148

# ఇటలీ.

వివిధదేశాల ప్రకృతి చిత్రములు, ఆచారవ్యవహారాలు, విజ్ఞానము, చరిత్ర, మానవుని జిజ్ఞాసదృష్టికుత్తేజనము కలుగజేస్తాయి. ఈగ్రంథము ఇటలీదేశంయొక్క అద్భుత సుందర దృశ్యాన్ని చిత్రిస్తుంది. ఆదేశ ప్రజల ఆచారవ్యవహారాలు, చరిత్ర తెలిసికొనుటకు చాలసహాయ పడుతుంది.

రచయిత : దీక్షితులు.

౧౦౦ పుటలు గ్రంథము. వెల ౪ అణాలు.

ఉత్తమప్రతి వెల ౬ అణాలు.

# ఫాసిజం - కమ్యూనిజం - స్త్రీలు.

౧౦౦ పుటలుగల పుస్తకము. వెల ౪ అణాలు.

ఉత్తమప్రతి వెల ౬ అణాలు.

౧౯౩౬ ఆగస్టునెలలో వెలువబడుతూంది.

# ఆధిభౌతికవాదము.

కారల్ మార్క్సు : జీవితము ; ఉపదేశములు.

పూంజీవాద, సామ్రాజ్యవాదములచే పీడింపబడుచున్న కర్షక కార్మికవర్గముయొక్క విముక్తికై నూతనమార్గములను ప్రపంచమునకు బోధించి, మనశకములో మార్గదర్శి, యనిపించుకొన్న యీ ఆదర్శపురుషుని జీవితము పఠించదగినది. ఉపదేశములు, అనుసరింపదగినవి.

ఇంతయేల, కష్టపరంపరలో బడి పోవుచున్న మానవసంఘమును, సత్వరముగా గమ్యస్థానమునకు గొనిపోవుటకు, యీలాటి బోధనలు తెలిసికొని తీరవలయును.

క్రౌను ౧౦౦ పుటలు వెల ౬ అణాలు.

---

విశ్వసాహిత్యమాల, ముంగండ, Via. అంబాజీపేట, తూ. గో. జిల్లా.



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A102B 193 |
| పుస్తకం పేరు | సందేశాలు |
| తారీఖు | 26-10-2C |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 55 |
| పెద్ద సైజు పేజీలు | N/O |
| ఖాళీ పేజీలు | C/ BCI |
| లేని పేజీలు | N/O |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | K Daneep |
| పరీక్ష చేసినది | |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | N/O |
| పరిస్థితి | good |